# పీఠిక.

సారస్వతరచన కిది తొలిప్రయత్నము.

చిన్ననాటినుండియు మహామంత్రులకథలయం దభిలాష నాకెక్కువ. బి. ఏ. తరగతిలో నున్నప్పుడు వారి రాజ్యతంత్రజ్ఞత నాటకరూపమున చిత్రింపవలె నను యభిలాష మెండుగా నుండెడిది; కాని, అందులకు సమర్థుడను కా నను భయము వెన్నాడుచుండుటచే సాహసింపలేకుంటిని. మాకు ఇంటర్మీడియట్ తరగతిలో శ్రీ కొండాలి సుబ్బారావు గారి "హంపిక్షేత్రము" పాఠ్యగ్రంథముగ నియమింపబడెను. అందలి "పశ్చాత్తాపము" అను ఖండములో తిమ్మరుసు చిత్రము నా హృదయమున బాగుగ నాటుకొనిపోయినది. "రాజ్యప్రదానము" "పాణిగ్రహణము" "పశ్చాత్తాపము" ఈ మూడుఖండములును నా రచింపదలచుకొన్న విషయము నకు మూలములు. ఇందు సుమారు పదిపద్యములలోని భావములుగూడ అందులోనివే; పదములకూర్పు మాత్రము వేరు. కథావస్తువు దానినుండి కైకొని, నేను నాటీకరింప (Dramatize) దలచుకొన్న విషయము (Theme) న కను కూలముగ మార్చి, కల్పించి వ్రాసితిని.

"హంపీక్షేత్రము" కేవలము శ్రవ్యకావ్యము. కొలుత నే నీ నాటకమును కేవలము రంగస్థలముకొరకే వ్రాసితిని. 1939 లో "కళాభివర్ధినీ" నాటకసమాజ మనుపేర నొక సమాజము స్థాపించి, దానికొరకే నాటకము వ్రాసితిని.

ఎవరికవిత్వముగూర్చిగాని, పద్యములగూర్చికాని నారెంతమైనను చెప్పుకొనవచ్చును; కాని, నాటకము పద్యములకన్న ఎక్కువ ఇంద్రియానుభూతమైనది; అంతకన్న బాహ్యపరిస్థితులతోను, భౌతికవిషయములతోను ఎక్కువసంబంధము కలిగినది. పద్యము కవి తన్ను దాను సంతోషపరచుకొరకు మాత్రము వ్రాసికొన్నది; కాని, నాటకము తన్ను, ప్రేక్షకులనుగూడ సంతసపఱచుటకు వ్రాసినది. చివరకు, ఒకనాటకముయొక్క ఉత్కృష్టత, కవి, ప్రేక్షకులను సంతసపరచుచు తన్ను దానెంతవఱకు సంతృప్తిపరచుకొనునో దానిపై ఆధారపడియుండును.

ఈ నాటకమున, తిమ్మరుసు, రాయలు, గజపతి-ఈ ముప్వురును ముఖ్యులు. వీరికథలను చరిత్రలో చదివి వాటియందలి మక్కువచే వీరిపాత్రలను నేను నాటకీకరింపలేదు. కాని, నేను నాటకీకరింప దలచుకొన్నవిషయమునకు వీరు సరిగ సరిపోవుటచేతనే వీరిపాత్రల నిందు చిత్రించితిని. నాటకీకరింప దలచుకొన్నవిషయము రాజ్యతంత్రము, దాని వేర్వేరు స్వరూపములు: మొదట – రాజ్యతంత్రజ్ఞతయే సామ్రాజ్య

నిర్మాణమునకు ముఖ్యోపకారి యని నమ్మి, అం దసమాన ప్రజ్ఞ జూపియు, ఆ "అహ" మున నశించిన మేధావి యొకడు; తరువాత — రాజ్యతంత్రజ్ఞతయే సామ్రాజ్యవినాశమునకు ముఖ్యోపకారి యని నమ్మి, అం దసమానప్రజ్ఞ జూపి, ఆ "అహ"మున నశించిన మేధావి యొకడు; రాజ్యతంత్రజ్ఞతకు నృపధర్మపాలనమే ముఖ్యాధార మని నమ్మి, తదహంలో నశించిన శక్తియుతుడొకడు. ఈ మూడుభిన్నప్రకృతులొకచో కూడినప్పు డనివార్యమున అగ్ని ప్రజ్వరిల్లి ఒకమహాసామ్రాజ్యమును నాశనమొనర్చినది. తిమ్మరుసు, గజపతి, రాయలు, ఈ ముగ్గురిపాత్రలును పైప్రకృతులను సరిగ సమర్థించును. నా ప్రయత్నము ఒకవిషయమును నాటీకరించుట (Dramatization of a theme) యేకాని, కూలంకషమగు పాత్ర రచన కాదు; కావున ప్రతిపాత్రయందును నే నెన్నుకొన్న విషయమున కనుకూలమగు గుణశీలాదుల నెన్నుకొనుటకు నేను స్వతంత్రుడను. వీరిపాత్రరచన అసంపూర్తిగ నున్న దనియు, వారికి నేను చిత్రింపని గుణసంపద లెన్నియో గల వనియు చెప్పుట విమర్శకులపనికాదు; నేను చిత్రించిన గుణములలో వారివి కాని వేవో చూపుటయే వారిపని. రాయలు కవిపోషకుడు కావచ్చును; ఆంధ్రులు గర్వింపదగిన గుణము లెన్నింటికో ఆటపట్టుకావచ్చును; కాని, నే చిత్రింప దలచు కొన్న విషయము ని వెట్లు సమర్థించును?

పైని వివరించిన విషయములుమాత్రము చిత్రించి పిడిచినచో, మానవప్రకృతిని ప్రతిఫలించు సజీవమైననాటిక గాక, రసహీనమగు కొన్ని ఘట్టములకూటమి తయారై యుండెడిది. తొలి ప్రదర్శనమునకు వ్రాసినప్రతిలో "హంపీక్షేత్రము"లోని పద్యములనే ఉపయోగించితిని. కాని, అందు తిమ్మరుసుపాత్రకు వ్యక్తిగాని, మానవత్వము గాని లేక, ఆదినుండి అంతమువరకు ఏకరసప్రధానమై జాలిని మాత్రము రేకెత్తించుచున్నది. తక్కిన పాత్రలుకూడ నట్లే చాలవరకున్నవి. కనుక ఆపద్యములను తీసివేసి పాత్రలకు వెలుగు నీడలనిచ్చి సహజమానవత్వ మాపాదింప యత్నించి తిని. తనజీవితములో తిమ్మరుసు ఒనర్చినవి రెండు: ఒక చక్రవర్తి, ఒకమహాసామ్రాజ్యము. కాని, ఈరెండును అతని అహంభావమున భగ్నమైనవి. అట్టిచో నిక జాలికి తా వేది?

కృష్ణరాయుడు మహామంత్రి తిమ్మరుసు మేధాశక్తి యొక్క భౌతికస్వరూపము; అట్టిరాయలు స్వతంత్రశక్తి వినియోగించి ఒకసామాన్యకార్యము చేయజాలకుండె నన్నచో ఆదెబ్బ తిమ్మరుసుమేధాశక్తికే; కనుకనే

"పిన్నతనంబునుండి నిను । పెంచినప్రేమను పీటబుచ్చి నా
కన్నులు పీకినందులకు । గాదు; "సుధీయుతుడంచుమున్నతా
మన్నన లందుమంత్రి అస । మానమహత్త్వఫలమ్ము"టంచు ని
న్నెన్నుదు రెల్లరన్నతల । పేచుటచేసుమి సారెసారకున్"

అని వాపోయినాడు. ఒకవిధముగ నిది Intellectual Tragedy. తనమేధాశక్తికి విఫలత్వ మున్నదాయన్న అహంభావములో తిమ్మరుసు రాయలసామర్థ్యమును వెల గట్టజాలకుండెను. రాయలకు తిమ్మరుసు లేనిచో వ్యక్తిత్వము లే దను విషయము గ్రహించి, సరిగా నచ్చట గురి చూచి దెబ్బకొట్టగలిగినాడు ధీశాలి గజపతి. ఆదెబ్బతో తిమ్మరుసుకు తెలివివచ్చినది కాని, అప్పటికే మించి పోయినది.

ఈ నాటక మీా విషయములను విఫలముగాకుండ, చదువరులకును, ప్రేక్షకులకును అందజేసినచో నా యత్నము సఫలముగ భావింతును.

ఇందలి భాషగూర్చియు, పద్యములగూర్చియు రెండు మాటలు: నేడు అన్నింట గ్రామ్యము విరివిగ వాడబడుచు న్నది. సారస్వతరచనకు భాషాగాంభీర్యము (Dignity of Style), పటుత్వమును ఉండవలెను. అందులో చరిత్రాత్మక నాటకములకు గ్రాంధికశైలి ఒకవిధముగ పురాతనత్వము నాపాదించును; ఒకవాతావరణము (Atmosphere) ను సృష్టించును. అట్లని అనవసరముగ అర్థముగాని సమాసముల గూర్పక, ఒకమధ్యరకపుశైలి నవలంబింప ప్రయత్నించితిని. ఆంగ్లభాషవలె మనభాషకూడ నుండవలె నన్నచో పొసగదు; అవసరమును లేదు. భాషాసాంప్రదాయములకు పరస్పర

సంబంధమున్నది. మన మత, సాంఘిక, రాజకీయసాంప్రదాయములు పాశ్చాత్యసాంప్రదాయములకు భిన్నములు. భాషాకోవిదు లీ విషయమును గుర్తించిన తెనుగుదేశమున చాలవరకు పోట్లాటలు తగ్గియుండెడివి. ఇందలిపద్యములలో నొకటి, రెంట యతిప్రాసలు లోపించినవి. వాటిని మార్ప యత్నించితిని కాని "అతుకు" వలె గన్పట్టుటచే నట్లే యుంచితిని.

ఈ నాటకరచనయం దనేకవిధముల నాకు తోడ్పడిన మా పినతండ్రిగారైన శ్రీ గుంటూరు శ్రీహరిగారికి నా కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

రసగ్రాహణపారీణులగు సారస్వతాభిలాషు లీ నాటకమునందలి కొత్తపోకడలను గుర్తించి ఆదరింతురుగాక యని కోరుచున్నాను.

యలమంచిలి,
15—5—1940 } గుంటూరు సత్యనారాయణ.

---

## సూచన.

గ్రంథకర్త యనుమతిలేక ఈ నాటకము ప్రదర్శించువారుగాని, ఫిల్ముచేయువారుగాని, ఇందలి పద్యాదుల నుపయోగించువారుగాని శిక్షాపాత్రులగుదురు.

గుం॥ స॥

పి న్న టి—

తెనుగు సారస్వతమున నా కభిరుచిగల్గించిన

శ్రీ మాతృపదములకు

ఈ తొలిఫలమును భక్తిపూర్వకముగ ...

తిమ్మరుసు.

గజపతి.

కృష్ణదేవరాయలు.

నాగమనీడు.

కళింగునిమంత్రి.

యువరాజు.

పురజనులు.

అల్లసాని పెద్దన.

భటులు.

అన్నపూర్ణ.

చేటి.

# తిమ్మరుసు

## ప్రథమాంకము

### మొదటిరంగము

[ఆంధ్రరాజసభ. రాయలు, తిమ్మరుసు ప్ర॥]

కృష్ణ:—ఆంధ్రకవితాపితామహులకు నమస్కృతులు.

పెద్దన:—దిగ్విజయమస్తు.

(కృష్ణరాయడు సింహాసనమధిష్ఠించును.)

తిమ్మ:—పాండ్యరాజ్యముపై వీరమనీని దండయాత్ర ప్రభువుల దక్షిణదిగ్విజయయాత్రకు తొలిపలుకు కాగలదు. నాల్గుదినములనుండి వేగులవాండ్రు రాలేదు. వారు వచ్చినగాని మనసేన లిచ్చటనుండి కదలజాలవు.

(ప్రవేశము:—భటుడు రాయలకు ఒకలేఖ నందించును)

(రాయలు లేఖచదువుకొని దానిని తిమ్మరుసున కందించుచు)

కృష్ణ:—విజయప్రేరితుడై మదోద్రేకమున కన్నులుగానక వీరమనీడు స్వాతంత్ర్యమును ప్రకటించినాడట! ఆంధ్రమహాసామ్రాజ్యసింహపీఠిక నలంకరించినట్లే పొంగుచున్నట్లున్నది!

తిమ్మ:—(చిరునగవుతో) వీరమనీకు స్వాతంత్ర్యమును ప్రకటించినంతమాత్రమున రాయలదిగ్విజయయాత్ర నిలిచిపోదు. ప్రస్తుతము వీరమనీని లొంగదీయుట కుపాయాంతర మరయవలయును.

కృష్ణ:—ఉపాయాంతరమున కే మున్నది? దక్షిణదేశ దిగ్విజయయాత్రి వీరమనీనిపై యుద్ధముతోడనే ప్రారంభము కాగలదు. ఆంధ్రమహాసామ్రాజ్యము యోధులులేక గొడ్డువోలేదు. (అని తనయొరనుండి కరవాలమును వెలికి పెరికి నిలువబడి సభ నుద్దేశించి) మీలో నింకను ఆంధ్రవసుంధరా సంరక్షణోత్సాహము మొక్కవోనివారున్నచో వీరమనీని నోడించి బందిగా మాకడకు గొనిరండు. తదుద్యమోత్సాహు లీఖడ్గమును గైకొనవచ్చును.

(సభ నిశ్శబ్దము. రాయలు క్షణమాత్రమూరకుండి)

ఓహో! మేటియోధులకు పుట్టినిల్లగు రాయలయాస్థానము నేటికి పిరికిపందల కెరవయ్యె నను వింత నేడు మేము గ్రహించితిమి. మీలో నొక్కనికిని పౌరుషములేదా? లేక మీరెల్ల మా యుప్పు తిని మాకే ముప్పు దలపెట్టు రాజద్రోహియగు వీరమనీని యాప్తులా? "పాలుదావి తల్లిరొమ్ము గుద్దినట్లు" తెనుగుతల్లి గర్భమున జనించి యామె నిప్పుడు పరవశమొనర్చి మాతృనామమునకు కళంకమాపాదింతురా?

(సభ నిశ్శబ్దము. నాగమనీడు లేచి రాయలకు నమస్కరించి మొగమువంచి వినమ్రుడై నిలచియుండును. తిమ్మరుసు చిరునవ్వునవ్వును.)

కృష్ణ:—ఆశ్చర్యము! తండ్రి యంత యొనర్చెను కొడుకేమి చేయజాలడు?

తిమ్మ:—అవును కొడుకేమి చేయజాలడు? మాతృగర్భసంజనితశోకానలము నాలకించి పితృభావమునకు చోటీయక యాతని జయించి తమ సన్నిధి జేర్పగలడు.

కృష్ణ:—అప్పాజీ!!

తిమ్మ:—ప్రభువులు మరియొకలాగున నెంచినచో నా యాలోచనకు బద్ధులుకారు.

కృష్ణ:—(చిరునగవుతో నాగమనీని నుద్దేశించి) నాగమనీడా! నీవంటిసుతులగన్న ఆంధ్రమాత ధన్య. పురాణేతిహాసములయం దిదివరకు వర్ణింపబడ్డ తండ్రి కొడుకుల యుద్ధములు స్వలాభప్రేరితములు. నిప్రతిజ్ఞ త్యాగయుక్తుఁయుంట యోధవరుల కాదర్శపురుషుడవైతివి. సేనానాయకత్వ మంగీకరించి యీఖడ్గమును గొని వీరమనీని జయించి తెలుగురాయలకొలువునకు వన్నె దెమ్ము.

(నాగమనీడు క_త్తిని పుచ్చుకొనును. సభలో
జయజయధ్వనులు)

నాగ:—(క_త్తిపట్టుకొని)

చ॥ సమరములం దమేయజయ
సంపద లందియు నాదుతండ్రి త
ద్విమలయశంబు, శీలమును
వీడి, నృపాలు నెదిర్చి తెల్గుభూ
రమ కపకార మెంచె, నను
రాగము వీడి దురాత్ము డన్న పే
రు మహిని బాపకున్న మది
రోయరె మాన్యులు నన్ను పార్థివా॥

తండ్రి-రాజు-దేశము-యీ ముప్పేరమధ్యపడి నా హృదయ మెంత పరిత_ప్తమగుచున్నదో ప్రభువు లూహింపగలరు! నే నావేశపూరితుడనై యీ పని కియ్యకొనలేదు. మనసున తీవ్రచర్చ యొనరించి ప్రస్తుతపరిస్థితులయందు పితృభావమునకును సేవాధర్మమునకును చాలదూర మని నిర్ణయించుకొంటిని. ఇందు నా ప్రవ_ర్తనము న్యాయవిరుద్ధమైనచో సర్వేశ్వరుడు నన్ను క్షమించుగాక. మహారాజా! యిదే రాజద్రోహిని నీ పాదసన్నిధి నుంచుటకు బోవుచుంటిని. సెలవిమ్ము.

(అని నమస్కరించి వెడలిపోవును.)

(తెర దిగును.)

---

## ద్వితీయరంగము

[ప్రవేశము—ఇద్దరు పురజనులు]

మొ॥పు॥జ:—ఏమంకోయ్ కోటలోంచే రాకలాగుంది. తండ్రికొడుకుల "లడాయ్" మాబాగా పెట్టేరు రాజుగారు! యేమైనట్లో వార్తలేమైనా వచ్చేయా?

రెం॥పు॥జ:—మీకింకా తెలియేలేదా; లోకమంతా కోడై కూస్తూవుంటేను! తండ్రిని జయించి కొడుకు ఖైదీగా తీసుకొస్తున్నాడట!

మొ॥పు॥జ:—ఏం త్యాగమండి! ఏం త్యాగమండి! బంటన్నవాడలా గుండాలి! కాస్త వయస్సు ముదరగానే తండ్రిని రోకాయించి ఆస్తి "కరార్రావుడు" చుట్టేసేకొడుకు లెంతమంది లేరు? అయితే చూసేరా - సముద్రమూ నీళ్ళిస్తుంది మేఘమూ నీళ్ళిస్తుంది.

రెం॥పు॥జ:— బాగా సెల విచ్చేరు. ఎప్పటికైనా రత్నం రత్నమే. బొగ్గు బొగ్గే. మరి శెలవు.

మొ॥పు॥జ:—చిత్రం. చిత్రం.

(నిష్క్రమించును.)

(తెర వ్రాలును)

## తృతీయరంగము.

[కృష్ణరాయలసభ: ప్ర॥ నాగమనీడు, బందితుడైన వీరమనీడు]

కృష్ణ:—నాగమనీడా! మాదిగ్విజయయాత్రకు శుభప్రదమగు ప్రారంభోత్సవము జరిపినందులకు తెనుగువారు నీకు కృతజ్ఞులు. నేటినుండి నిన్ను మా సేనానాయకునిగ నియమించినారము. కళింగరాజ్యచ్యుతిన్ గొనర్చి విజయదుందుభులు మ్రోగింపుము.

నాగ:—ప్రభువుల బహూకృతికి కృతజ్ఞుడను. కాని, ప్రభూ! నేనిప్పుడు యోధవరుడను గాను. సేవకుడను గాను. ఇచ్చటనున్న బందీకి సుతుడను. రాజసేవా తత్పరుడనై యీతని జయించి సేవాధర్మము కాపాడితిని. ఇప్పుడు నా తండ్రిని రక్షించుకొని పుత్రధర్మము కాపాడుకొన నెంచితిని.

చ॥ చేసితి దేశసేవయును
 చేతగొలందియు రాజసేవయున్
చేసితి తండ్రికిన్ సుతుడు
 చేయగరాని మహాపరాధమున్
కాసితి పుత్రధర్మమును
 భావి యుగమ్ముల నింద నందగా
కాసెద చాలు నీ కొలువు
 పంపుము నన్నిక కృష్ణభూపతీ॥

నే నిక తమకొలువున పని చేయజాలను, ప్రభువులయాజ్ఞ!

కృష్ణ:—యోధవరా! నీ పితృభక్తికి మెచ్చితిమి. నీ తండ్రిని క్షమించి విడిచిపుచ్చుటయేగాక మఱల యీ పాండ్యరాజ్యమునకే సామంతప్రభువుగ నియమించుచున్నాము. రాయలు కృతఘ్నుడు కాజాలడు. నేడే నీవు సమరసన్నాహముఁ గావించి......

తిమ్మ:—కళింగగజపతికి వార్తాహరుడవై రాయలు మాటలుగా నిట్లు తెలుపుము.

ఉ॥ కైకొను మాంధ్రరాయమహి
కాంతజిగీషుని వాదనమ్ములన్
చేకొను రాయబారమిది
సేనలు దిగ్విజయమ్మునందగా
నేకపురాకమున్ను [illegible]
నేచును గావున సంధిచేసెనో
లేక, మనేచ్ఛ [illegible] వ్యాని
[illegible]లసెదిచ్చి సరిహద్దు నేతురో॥

కృష్ణ:—అప్పాజీ! ఈ నియమములకు గజపతి ఎట్లును ఒప్పుకొనడు. ఈవరికే యాతడు మ్లేచ్ఛులతోఁ గూడి విజయనగర సామ్రాజ్యముపై కత్తిగట్టినాడు. అట్టిచో నిక రాయబారములతో పనియేమి?

తిమ్మ:—ప్రభువులు సెలవిచ్చినది నిజము. కాని రణధర్మనిర్వాహణమునందు మన మేల వెనుకాడవలయును? ఇప్పటికే

మ్లేచ్ఛులెల్లరు నణగిపోయిరి. గజపతి యీ సంగతి గ్రహింపకపోలేదు. ఎప్పటికైన రాయలుఖడ్గము తనపై తిరుగు నను భయము అతని వెన్నాడుచునేయుండును. కావున సామ్యమునకు లొంగినను లొంగవచ్చును.

కృష్ణ:—అప్పాజిసలహాకు రాయ లెన్నడు బద్ధుడు కాలేదు? నాగమనీడా! అప్పాజిపలుకులను మా మాటలుగా, కళింగరాజునకు తెలిపి శీఘ్రముగ ప్రత్యుత్తరము గొనిరమ్ము.

నాగ:—ప్రభువులయాజ్ఞ! (నిష్క్ర)

కృష్ణ:—సభ ముగిసినది.

(తిమ్మరుసు దక్క మిగిలినవారు నిష్క్రమింతురు)

కృష్ణ:—అప్పాజీ! కళింగరాజు యుద్ధమునకే తలపెట్టినచో, నిట రాచకార్యములు సరిజూచువారెవరు?

తిమ్మ:—(చిరునగవుతో) నాయనా! నీ వీ పాటికి వివాహితుడవైనచో పట్టమహిషి యుండెడిదిగదా! నా చేతులతో నా మనుమని ఆంధ్రమహాసామ్రాజ్యపట్టాభిషిక్తు నొనర్చుటకు నా మన సువ్విళ్ళూరుచున్నది!

కృష్ణ:—(చిరునగవుతో) ఈ మహాసామ్రాజ్యరమను నాకు చేకూర్చిన అప్పాజి, తనకు నచ్చినకన్యనే నాకు పట్టమహిషిం జేయగలడు!

తిమ్మ:—నూతనరాజ్యకన్యతో రాజకన్యకూడ వచ్చునేమో!

కృష్ణ:—నూతనరాజవర్యులు శత్రువు లను మాట అప్పాజి విస్మరించినట్లున్నది!

తిమ్మ:—రాజవర్యులు శత్రువులైన, రాజకన్యలుగూడ కావలయునా? ... ప్రస్తుతవిషయము... నాయనా! రణరంగమున పాల్గొనుపటిమ నాకు తగ్గిపోయినది. కావున, నేనే ఇచటనుండి రాచకార్యములు జూచుకొందును. నీ వేగి లబ్ధవిజయుడవై తిరిగిరమ్ము.

(తెర)



# తిమ్మరుసు

## ద్వితీయాంకము.

### మొదటిరంగము.

[కళింగ గజపతిసభ]

గజ:—కృష్ణరాయడు దిగ్విజయయాత్రకు బయలుదేరు నను వార్త నేడే వచ్చినది. కళింగరాజ్యముపై గూడ దండెత్త నెంచినచో మా శక్తి యున్నంతవరకు ప్రతిఘటింప నెంచితిమి. మ్లేచ్ఛులసాయ మపేక్షించినను వారిదివరకే రాయలకు లొంగియుండుటచే మనకు సహాయ మొనర్ప జాలరు.

మంత్రి:—నేడో, రేపో, రాయలు రాయబారి నంపగలడు.

గజ:—దక్షిణదిగ్విజయయాత్రకు వెడలు రాయలు కళింగ రాజ్యము నణచుటకు మున్ను సేనలను రెండుగా విభజింపడు. అట్లే చేసిన యిరుతెరవుల నోటమి తప్పదు. ఆతడు రాయబారము పంపు నను నమ్మకము మాకు లేదు.

మంత్రి:—రణధర్మానుష్ఠానతత్పరుడగు తిమ్మరుసుండగా నట్టియధర్మము జరుగదు.

(ప్రవేశము-భటుడు)

భటు:—దేవా! రాయలకొలువునుండి రాయబారి యొకడు వచ్చి దేవరదర్శనార్థియై వెలుపల వేచియున్నాడు. సెలవు.

మంత్రి:—ప్రవేశపెట్టుము.

(భటుడు నిష్క్రమించును.)

(ప్రవేశము:—నాగమనీషు—రాజునకు నమస్కరించి.)

నాగ:—గజపతి రాయుల సముఖమునకు ప్రణతులు. ఇది రాయలసందేశము. (అని లేఖ నందించును)

(గజపతి లేఖను పరిశీలించి)

గజ:—దీనికి సమాధానము మే మీవరకే నిర్ణయించియుంటిమి. మేమును సమరసన్నాహమునసే యుంటిమి. మా పలుకులుగ రాయలకు నిట్లు నివేదింపుము.

ఆ॥ వె॥ ఎదుట నిల్చి పోరి యోడుటో, గెల్చుటో
యొకటి జూచు నెప్పు యోధవరుడు
సాటివారితోడి సమరంబు స్వర్గంబు
సంధి కీయకొనగజాల నెనుము.

నాగ:—ప్రభువులయాజ్ఞ! కాని "గోటితో గిల్లవలసినది గొడ్డళ్ళతోగాని తెగని" స్థితికి తెచ్చుట శ్రేయస్కరము కాదు. శాంతియుతముగ జరుగవలసినదానికి అసంఖ్యాకుల ప్రాణములు బలియొసంగుట రాజునకుగాని, ప్రజలకు గాని మే లొనర్పజాలదు.

గజ:—నిన్ను రాయః బార మొనర్ప బంపిరిగాని హితోపదేశ మునకు గాదు. మాసమాధానము గొని నీ విక యేగ వచ్చును.

నాగ:—(వెడలిపోవుచు) "చెట్టు చచ్చుకాలమునకు కుక్క-మూతిపింజెలు!"

(నిష్క్రమించును)

గజ:—వీనిది రాక్షసజన్మ. సేవాతత్పరత యను మిషచే తండ్రి నవమానించినవాడు నీతులు చెప్పవచ్చినాడు.

మంత్రి:—ఇక రాయలతో యుద్ధము తప్ప దను మాట నిశ్చయమైనది. సేనలు సిద్ధముగనున్నవి. నేడో, రేపో సరిహద్దుప్రాంతములకు కదలిపోవును. రిపువర్గము కోట ముట్టడించినపుడు వలయుసామగ్రులు సరిచేసికోవల యును.

గజ:—న్యాయయుద్ధమున తెల్గురేని నిర్జించుట కష్టము. అత నిని కృత్రిమోపాయముననే చంపవలయును. నేటికి సభ చాలింతము.

(తెర వ్రాలును)



## ద్వితీయరంగము

(కళింగరాజోద్యానవనము. కళింగరాజకుమార్తె అన్నపూర్ణాదేవి పూలుగోయుచు నుండును. ఈవలనైపునుండి నాగమనీడు ప్రవేశించి రాకన్నియను జూచి)

ఈ యమ సౌందర్యప్రసిద్ధయగు అన్నపూర్ణాదేవి యై యుండనోపు. బల పరాక్రమ యశో విదితుండగు మా రాయ లీమెను చెట్టబట్టిన, పసిడికి తావి యబ్బినట్లగును కదా! (వెనుకనుంచి చెలికత్తె ప్రవేశించి)

చెలి:—(స్వగ) ఓహో! మా సఖి శృంగారగ్రంథపరిచయ మొనర్చుచున్నట్లున్నది! ఈత డెవ్వడో! క్షత్రియ తేజము కానరాదు. పలుకరించి చూచెదను (అని సమీపించి) ఆర్యా! అంతఃపుర కాంతలు విరుగాడు నీ వనమున తాము ప్రవేశించుట తా మన్యనగరవాస్తవ్యు లని తెలుపకయే తెలుపుచున్నది. మీ రెవ్వరు? మీ రాకకు గతం బెద్దియో నే నడుగవచ్చునా?

నాగ:—బోటీ! ఇది రమణీమణుల యుద్యానవన మను సంగతి నెరుంగక యిందు జొచ్చితిని క్షమింపుము. నా పేరు నాగమనీడు. కృష్ణరాయుల సేనాధిపతిని.

చెలి:—కృష్ణరాయుల......

అన్న:—(తత్తరముతో ముందునకువచ్చి) సఖీ! ఏమే కృష్ణరాయ లనుచుంటివి? (నాగమనీని గాంచి సంభ్రమముతో చెలికత్తెవెనుకకు బోయి తలవంచుకొని నిలువబడును.)

చెలి:—ఇ దేమి సిగ్గమ్మా! కర్ణాకర్ణిగ విని వరించినదానవు. ఇదుగో నీప్రియుని సేనాధిపతియట వచ్చియున్నాడు. రాయబారమంపుము.

అన్న:—(సన్ననిగొంతుకతో) సఖీ! పరిహాసములాడక నీవే చెప్పవే!

చెలి:—అవునా! మా సఖికి అపరిమితమగు సిగ్గు. కర్ణాకర్ణిగ మీ రాయని బల పరాక్రమ సౌందర్యాదుల నాలించి అతనినే వరించినది. మీరామె ఫోటోను చూచినారుగదా! ఈ సంబంధము కుదిర్చి పుణ్యము కట్టుకొనుడు.

నాగ:—(తనలో) నే ననుకున్నంత యైనది! ఇప్పుడు ప్రభువుల యుద్దేశము కనుగొనవలయును. (పైకి) సఖీ! ఈ యామె మాకు రాణియగుట మా పుణ్యముగ భావింతుము. నా చేతనైనంతవఱకు ప్రయత్నము నొనరింతును. పైని భగవంతుడున్నాడు.

చెలి:—(లోని కేగి తన సఖిచిత్రపట మొకటి గొనివచ్చి నాగమనీని కిచ్చును.)

నాగ:—(నిష్క్రమించును.)

అన్న—(నిట్టూర్పువిడిచి) సఖీ! నీ వెంతమంచిదానవే! నేడు నామనస్సు నానందాబ్ధి ముంచితివి! (అని ముత్యాలసరము సఖిమెడలో వేయును.)

చెలి:—ఎంత సంగనాచివే! ఇందు నే నొనర్చిన దేమున్నది? కోరి వరించితివి. చిత్రపటమునుగూడ పంపుకుంటివి! ఇక రాణిగారికి మేము జ్ఞాపకముందుమా!

అన్న:—(కన్నీటితో) సఖీ! ఆయన నన్ను తిరస్కరించినచో నే నే మయ్యెదనో, యెట్లు చూచుకొందును!

సఖి:—తిరస్కరించుటకు నీకన్న చక్కనిచుక్క లెచ్చట నున్నారమ్మా!

అన్న:—సఖీ! అట్లుకాదు. నా తండ్రి యీ సంబంధమున కెంతమాత్ర మిష్టపడదు ఆయనకూడ శత్రు రాజ కుమార్తె నగు నన్ననుగ్రహించునా?

సఖి:—ముందు రాబోవునది తలచుకొని యిప్పుడు విచారింప నేల? పైన భగవంతుడున్నాడు. రమ్ము పోవుదము.

(నిష్క్రమింతురు)

(తెర)

---

## తృతీయరంగము.

---

[ప్రవేశము:-రాయలు, నాగమనీడు.]

రాయ:—అట్లయిన గజపతి యుద్ధమునకే సన్నద్ధు డన్నమాట! రేపే మనసేన లిచటనుండి కదలింతము.

నాగ:—ప్రభూ! ఒకవిన్నపము.

రాయ:—ఏమది?

నాగ:—కళింగరాజాస్థానమున రంభాదులను తిరస్కరించు సౌందర్యభాసిత యగు నొకక్షత్రియకాంతం గాంచితిని.

ఉ॥ నన్నయ తిక్కనాది కవి
నాధసువర్ణిత లక్షణమ్ముల
కన్నియకున్ సుభూమలగు
కావ్యపితామహు డల్లసాని పె
ద్దన్న వరూధినీరమణి
దా సరిజూపెడు నల్లతాంగి, నీ
కన్నిట జోడగున్ వసిడి
కబ్బినతావిగ కృష్ణరాణ్మణీ.

సర్వవిధముల నామె ప్రభువులకు తగియున్నది. ఈవిష యమున నేను స్వతంత్రించినచో క్షమార్హుడను!

రాయ:—(చిరునగవుతో) నాగమనీని కళవళపరచిన ఆసౌం దర్యరాశి యెవ్వతె?

నాగ:—(సగముభయముతో) ప్రభువులు క్షమింపవలయును. ఆమె గజపతి కుమార్తె అన్నపూర్ణాదేవి!

రాయ:—(పకపక నవ్వుచు) ఆనుష్టుని కూతురా?

నాగ:—ప్రభూ! నేను వీరమనీని సుతుడను!

రాయ:—అప్పాజి వెట్టి నీకును బట్టినట్లున్నది.

నాగ:—దీనిని పరికించి సమాధానమిండు. (అని పటము నందించును.)

రాయ:—(పటమును జూచి) రేపే మన సైన్యములు కళింగ రాజ్యముపైకి కదలిపోవును! (నిష్క్ర-)

నాగ:—తెలుగుప్రభువు!

(నిష్క్ర-మించును.)

(తెర)



## చతుర్థరంగము.

[కళింగరాజ్యప్రాంతముల రాయల విడిది. రాయలు చేత పటము బట్టుకొని ఆసనమున నుపవిష్టుడై యుండును.]

రాయ:—ఉ॥ "నన్నయ తిక్క నాది కవి
నాథ సువర్ణిత లక్షణమ్ము లీ
కన్నియకున్ సుభావలగు
కావ్యపితామహు డల్లసాని పె
ద్దన్న వరూధినీరమణి
దా నెఱుగాపెడు నీ లతాంగి......"

చిత్రరచనాకౌశల్యమునకు గొంత చోటొసగినను, నే నీవర కిట్టిసౌందర్యమును గాంచలేను.

(అని పటముక్రిందవ్రాతను జూచి) ఓహో! ఇం దేదియో లిఖింపబడియున్నది.

ఉ॥ పేరున సామ్య మెంచి, యొక
చిత్రవిచిత్రము దొంగిలించి కం
సారిని బోల నెంచితివొ!
సాంతముగా కడజూపినన్ గదా
పే రిల సార్థకంబగు, ను
పేక్షవహింపక సత్వరమ్ముగన్
జేరుము, పాణి చేకొనుము,
జీవము నిల్పుము ప్రాణనాయకా॥

ఓహో! రచనాచమత్కృతి! సామ్యము చక్కగనే యతికి నది! దానిని కడచూపు భారము నాపైననే వైచినది గదా! అప్పాజియాశీర్వాదఫలితముగ నీమెయే లభించి నచో నే కోరదగిన దేమున్నది?

(ప్ర॥ భటుడు):—దేవా! గజపతిఆస్థానమునుండి యెవ్వరో యొకవ్యక్తి గుడారము వెలుపల వేచియున్నాడు. తమతో నవసరమగుకార్యమును చర్చింప తొందరపడుచున్నాడు.

రాయ:—(సాలోచనముగా) ఈనిశీథసమయమున శత్రురాజు సందేశమంపునా! సరియే ప్రవేశపెట్టుము.

(సేవకుడు నిష్క్ర)

(ప్రవే॥ మేనెల్లముసుగుధరించిన యొకవ్యక్తి. ముసుగు తొలగించి రాయులకు నమస్కరించి)

స్త్రీజన విరుద్ధమగు నాసాహసము ప్రభువులు మన్నింపవల వయును. నేను గజపతి కుమార్తెయగుఅన్నపూర్ణాదేవి చెలి కత్తెను. తమ సేనానాయకునిముఖమున నిదివరలో మా సఖి యంపిన వార్త తమ కందియేయుండును. మా సఖి తమ దర్శనాపేక్షియై నాటినుండి అన్నపానములు త్యజించి విరహాతప్తయై కృంగుచున్నది. నేడు తమరాక విని తన మాటలుగ తమ కిట్లు విన్నవింపుమని నన్ను పంపినది. "ప్రాణేశ్వరా! త్రికరణశుద్ధిగ నిన్ను వరించిన యీదీను

రాలి నుపేక్షింపక అనుగ్రహింపుము. నన్ను పరిగ్రహించి నా ప్రాణముల నిలుపుము."

కృష్ణ:—చేటీ! మీ సఖి పంపినవార్త మా కనుకూలముగనే యున్నది! మా మాటలుగా మీ సఖతో నిట్లు జెప్పుము. "రేపే యుద్ధము ప్రారంభము కాగలదు. అందు గజపతిని నిర్జించి, నిన్ను గొనిపోయి విజయనగరసామ్రాజ్యమునకు పట్టమహిషి నొనర్తును." (అని తన వ్రేలిఉంగరమును తీసి) ఈ అభిజ్ఞను మీ సఖకొసంగి చింతదక్కియుండుమనుము.

(నిష్క్రమించును)

(తెర)



# తిమ్మరుసు

## తృతీయాంకము.

### మొదటిరంగము.

[గజపతి రక్తసిక్తవసనములతో చేత ఖడ్గము ధరించి ప్రవేశము]

గజ:—సర్వనాశనమైనది! మూ డక్షౌహిణుల సైన్యమును మంటగలిసినది. ఎదిరిబలము గానక మదాంధుడనై రాయుల నెదిరించితిని. మ్లేచ్ఛకూటమును రూపుమాపిన తెలుగువీరులకీ యుద్ధము కడు సులభసాధ్యముగదా! విధి ప్రతికూలుడగుటచే సంధికై రాయుల ప్రార్థింపక తప్పి నదికాదు. నాడే వివేకము ప్రవర్తించినచో యీప్రజా నాశనము తప్పియుండెడిదిగదా! చివరకు మానప్రాణ ములు భగ్నమగుస్థితికి గొనివచ్చితిని. ఇప్పుడు సంధికీ రాయ లెట్టినియమములు విధించునో తెలియదు. ఏమై నను ప్రస్తుతము లొంగితీరవలయును. చతురుపాయంబులు వ్యర్థమైనపుడు, అయిదవది కృత్రిమోపాయమున్నదిగదా!

(ప్ర: మంత్రి)

ప్రభూ! రాయలు సంధి కంగీకరించినారు. కాని, విధింప బడిన నియమము లుత్సాహకరములుగ లేవు.

(అని లేఖను గజపతి కిచ్చును)

గజ:—(లేఖను పరికించి, కోపముతో) ఓడినంతమాత్రమున గజపతికి మానాభిమానములు లేవనియే యెంచినాడా రాయలు? రాజ్యకన్యతోబాటు నా కూతునుగూడ నాతని కొసంగవలయునట! నే నేమో తనకు సామంతు డనై ఏటేట పదిలక్షలు కప్పముగట్టవలెనట! ఏమీ రాయలవెట్టి! గజపతిప్రజలు యీయాయుద్ధమును కడజూ తురు గాని, యీనియమములకు బద్ధులుకాజాలరు.

మంత్రి:—ప్రభూ! కోరక ప్రజానష్టమొనరించుట రాజతంత్రముగాదు ఈపరిస్థితులలో లొంగియుండి, సమయము వచ్చినపుడు దెబ్బవేయవలెను. ఈనియమములను మన కనుకూలముగ మార్చుకొనుటయే ప్రజ్ఞ.

గజ:—నీపలుకులు తొలుత బందెలో ప్రవేశించి పిదప తప్పించుకొనుటకు మార్గమరయుమనునట్లున్నవి! ఈనియమములకు మన మొడంబడినచో మరి కళింగరాజ్యమునకు ముక్తియున్నదా? అదిగాక ఒక్కగానొక్కబిడ్డను ఆగర్భ శత్రువుచేత నిడి గజపతి యెట్లుజీవింపగలడు?

మంత్రి:—ఏలికలు పొరబడుచున్నారు. సౌభాగ్యవతి తండ్రి ఋణమును తీర్చుకొనజాలదా?

గజ:—ఆమె తప్పక యీవివాహమున కంగీకరించును. నా యిచ్ఛకు వ్యతిరేకముగ నామె యెన్నడును చరింపలేదు. కాని, కని పెంచిన యీచేతులతో నామె నెట్లు బలి యొసంగగలను?

మంత్రి:—నాయుద్దేశ మదిగాదు. రాయలు మన కొంటిగ చిక్కుట యసంభవము. అన్నపూర్ణాదేవి యంగీకరించి నచో నామెకట్టియవకాశము సునాయాసముగ లభించును.

గజ:—నీయుద్దేశము నాకు గోచరించుచున్నది. కాని, కృత్రి మోపాయమైనను నీచముగ నుండక పాండవులయధర్మము వలె లోకసమ్మతమైయుండవలెను. అదిగాక, ఒక్కగా నొక్కకూతునకు శుభమూ యని వివాహమొనరించి, ఆమెపసుపు కుంకుమలు నీటగలిపి నే నేమి చూచుకొని యానందింతును? చేతనైన యీవివాహము జరుగకుండ గనే రాయలను భ్రమందించు నుపాయమేదైన చెప్పుము. దీనికిమాత్రము నా మనము సమ్మతింపదు.

మంత్రి:—నియమింపబడిన సంధినియమముల కంగీకరింపనిచో మన రాజ్యమునకు ముప్పుతప్పదు. ఎదిరినిల్చి పోరుటకు శక్తిచాలదు. రాజప్రాణసంరక్షణాదక్షుండగు తిమ్మరుసు

బ్రతికియున్నంతకాలము మన తంత్రములెల్ల వ్యర్థములు! పాపభీతికిని రాజనీతికిని చాలదూరము. ఒక్కరాకుమార్తె ప్రాణములకై యాశించి ఆచంద్రార్కము కళింగమును సామంతరాజ్యముచేయ నిశ్చయించుకొనినచో ప్రభువుల యాలోచన బాగుగనుండును!

గజ:—(తనలో) ఈతని పలుకులు యుక్తియుక్తములుగ నున్నవి. కాని, యెంతప్రయత్నించినను జనకత్వము నెట్లు చంపుకొనగలను. ఇది తప్పినచో నుపాయాంతరము కానరాదు. కూతున కాశించినచో గజపతివంటి స్వార్థపరుడు లేడను నపకీర్తి నెత్తిబడును. లేనిచో, క్షత్రియధర్మము త్యజించి నీచోపాయముచే విజయమునందె నను కళంకము వాటిల్లకమానదు. ఆహా! సర్వేశ్వరా! నాస్థితి యెంతటికి దెచ్చితివి. నే చక్రవర్తిని గానిచో నాబిడ్డ నే బీదవానికైన నిచ్చి సంతసించెడివాడనుగదా.

చ॥ నిరుపమసౌఖ్యసంపదల
నిత్యము జొక్కు నదృష్టవంతు లీ
నరపతులంచు నెట్లు సుజ
నాళి తలంచునో? శాశ్వతమ్ముగా
నరకము తథ్య మీ నృపగ
ణమ్మున కంచు నెరుంగలేరు, యీ
ధరణి కిరీటధారణము
తద్దయు భారముగాదె యేరికిన్॥

ఎట్లయినను మానాభిమానములు విడనాడి రాయలకు సామంతుడనై యుండుటకన్న కృత్రిమోపాయము చేసైనను వానిని జయించి స్వతంత్రుడనై యుండుటయే మేలు.(పైకి) మంత్రివర్యా! నీయాలోచన యుక్తియుక్తముగ నున్నది. ఇందుకు నాబిడ్డను బలియొసంగ నాసిద్ధుడను! నేడే రాయలకు సంధినియమముల కంగీకరించినట్లు లేఖ నంపుము.

మంత్రి:—రాయలు నేడే తనసేన నిచ్చట నుంచి విజయ నగరమునకు బోయియున్నాడు. వార్తాహరునిచే లేఖ నిప్పుడే పంపగలను.

గజ:—సరి నాప్రయత్నమున నే నుందును.

(నిష్క్రమించుచును.) (తెర)

---

ద్వితీయరంగము.

---

[అంతఃపుర సౌధములో: అన్నపూర్ణాదేవి-చెలికత్తె]

అన్న:—సఖీ! నిన్ను చూడగనే ఆయన యేమనియెనే? నాయంత నేనై వార్త నంపినందులకు కినిసెనా? నిజముగ నాతడు నన్నునుగ్రహించెనా? సఖీ! నిజముగ నీ వెంతయదృష్టవతివే! కన్నులకరవుదీర ఆసుందరాంగుని

గాంచితివి. నా కన్న పట్టియదృష్టము బట్టునో కదా? నిజముగ నాతఁ డట్టిసుందరాంగుఁడే? నీనోట వినినయెన తనివి జెందెదను. నన్నూరించక శీఘ్రముగ జెప్పవే!

చెలి:—ఒక్కప్రశ్న – ఒక్క జవాబు – అతని సౌందర్యము వర్ణింపగలమటమ్మా! అనుభవింపఁబోవుచు అంత తహతహపడదవేల? నేడో రేపో పట్టమహిషివి కాఁగలవు; పిదప మే మగుపడుదుమటమ్మా!

అన్న:—[బాష్పపూరితనేత్రయై] సఖి! నేను పట్టమహిషిని కా నక్కర లేదు. ఆయనసన్నిధిని నిత్యమునుండు దాసినైనను జాలును.

(గజపతి ప్రవేశము; తండ్రికి అన్నపూర్ణ నమస్కరించి నిలువబడియుండును)

గజ:—సౌభాగ్యవ......! తల్లీ! నీతో నవసరమగువిషయము చర్చింపవచ్చితిని. (దాసి నమస్కరించి వెడలి పోవును.)

అన్న:—తండ్రీ! సావధానను.

గజ:—అమ్మా! రాజ్యముతోపాటు నిన్నుగూడ నర్పించినఁగాని సర్వనాశనమొనర్తునని రాయలు వార్త నంపినాడు. నీ వీ కఠోరవార్త నెట్లు భరింతువో తెలియజాలకున్నాను. బిడ్డా! దీనికి నీ వంగీకరించి ప్రజానాశనమును తప్పించి గజపతివంశమునకు కీర్తిదెమ్ము.

అన్న:—తండ్రీ! ఇన్నిదినములు మీతో చెప్పకుండ నుంచి నందులకు క్షమార్హను. ఏనాడు రాయలయశశ్చంద్రికలు నన్ను సోకెనో నాడే యాతని పతిగ వరించితిని తమశత్రు వగుటచే తామే మంకురో యను భయమున తమకు దెల్ప సాహసింపజాలకుంటిని.

గజ:—(తనలో) ఓహో! పరిస్థితులు విషమించినవే! ఇప్పుడు నాకార్యము కష్టతరమైనది. (పైకి) అమ్మా! ప్రజారక్షణ్కై నీ విప్పుడు ఒకమహాత్యాగ మొనరింపవలెను.

అన్న:—తండ్రీ! అందులకు నే నెల్లప్పుడును సంసిద్ధను.

గజ:—(ఆత్రముగ) క్షత్రియకన్యలు ఆడినమాట దప్పరు. (బాకు దీసి) శయ్యామందిరమున నీ ఛురియచే రాయల రక్తము దావించి, నీ తండ్రిఋణమును దీర్చుకొమ్ము.

అన్న:—(శొష్పశోచనయై) హా! తండ్రీ! ఇదేటిన్యాయము? త్రికరణశుద్ధిగ వరించి పెండ్లాడినమగని చంపుమని యే తండ్రియైన ప్రేరేపించునా? వలసినచో నాప్రాణముల నైన నర్పింతును గాని, మనోనాయకుని స్వర్గసౌఖ్య మొనగూర్చు నీచేతులతో నా హృదయేశ్వరుని చంప జాలను.

గజ:—బిడ్డా! కళింగరాజవంశప్రతిష్ఠాసంరక్షణార్థ మీపాటి సహాయమునకు లేనిపోనియడ్డంకులు కల్పించి కళంక మాపాదించుచున్నావు. ముక్కుపచ్చలారని పసిబాలవు-

'ప్రేమ ప్రేమ' యని పెద్దగ బలుకుచున్నావు. నీ కేది సౌఖ్యహేతువో నాకు తెలియదా?

అన్న:—తెలిసియే యిట్లుబలుకుచుంటిరా? బ్రతికియున్నంత కాలము వైధవ్యమనుభవించుట సౌఖ్యహేతువా? అనుదినము "మగనిజంపిన రాకాసి" యని ప్రజలచే దీవెనలు బడయుట సౌఖ్యహేతువా? అక్కటా! తండ్రీ! నేడేల మీకిట్టి విపరీతపుబుద్ధి పుట్టినది? అపకీర్తికి వెనుకాడవలదా? నేను బ్రతికియుండుటచేగదా మీకిట్టి యవకాశము లభించినది. ఈనీచపుపనికై యంతరాత్మను చంపుకొనుటకన్న ఆ ఛురికచే నా గొంతుకనే కోసికొందును.

గజ:—(కోపముతో) ఓహో! పిట్ట కూతపెట్టుచున్నదే! నిన్న మొన్న కన్నుదెఱచి నేడు నాకే పాఠములు చెప్పుచుంటివే! క్షత్రియకన్యకావిరుద్ధముగ నొక దాసీపుత్రుని వరించి, పెంచి పెద్దచేసినకృతజ్ఞతను వీటబుచ్చెదవా!

ఉ॥ దేసపుమానప్రాణముల
దీయగనెంచితె! నేటితోడ నా
యాస నిరాసజేయ మరి
యాదటె! నీమనసుఖమ్ము కోరినన్
దేసము ఘోషపెట్టె, నను
తిట్టునె! సిగ్గులచేటిదేమొ! దా
సీసుతుపైన మోహ మది
చెల్లునె! క్షత్రియకన్యవౌదువే!!

పాతకీ! ఆహీరుని వరించి నాకడుపున బుట్టకున్నను సంతసించెడివాడనే!

అన్న:—తండ్రీ! నన్నేమైన ననుము గాని, నా మనోహరుని నిందించిన నే సహింపను!

గజ:—ఛీ! నోరుమూయుము!

చ॥ సమరమునందు నే బడిన
చండపరాభవవహ్నికీలలన్
సమయగజేతువంచు మది
సంబరమందితి గాని, నే డిటుల్
విమలయశస్సుధాబ్ధి విధు
బింబముల జిల్కి సహింపరాని చి
చ్చు మది రగుల్చ జేతువని
చూడగనైతిని పితృఘాతకీ॥

చ॥ సలసల వేడినెత్తురులు
చారలుగట్టిన చేతి వ్రేళ్ళవే,
తలకొని శత్రుమస్తకము
దార్కొను బాకిదె, సేకరింపుమా
విలసదఖండసూర్యనిభ
వైభవదీప్తదిగంతకీర్తి ము
న్నిల వెలుగొందినట్టి శిర
మింపగు కానుకటంచు బల్కకన్-

చ॥ మగడని నాకు పల్కు తగవ
మానమునైన నను నెంచ కెవ్వడో
మొగము నెరుంగ నట్టి యొక
మూర్ఖుని గోరి, కళింగ రాజ్యమున్
పగతుని నోటబెట్ట, నను
వంచనచేయగ నెంచుదాన వీ
జగతిని నీ విక న్మనిన,
చచ్చిన నొక్క ఫలంబె రాక్షసీ॥

అన్న:—(పట్టుదలతో) తండ్రీ! ఏమైనగాని ఈపనిమాత్రము పోసగదు!

గజ:—చ॥ పొసగదటంచు బల్కితివి
పొమ్మిక! చెల్లెబుణమ్ము! శత్రుదో
ర్లసితమహాసిధారల వ
రాజితులైన జనాళిరోదనల్
కసిగొని నిన్నహర్నిశము
కాల్చును! గైకొనవమ్మ! నీకు నా
పసుపును కుంకుమం బివియె
భర్తృగృహంబున కేగువేళలన్॥

అన్న:—(రోషముతో) గజపతీ! నీకడుపున బుట్టుటచే నీకు బుణస్థురాలను. ఆఋణమీవిధముగగాని తీరదని తోచిన నీ పనియొనర్తును. ఆపైని నీపట్టిని జూడవు! నా కిక సెలవొసంగుము! (నిష్క్రమి) (తెర)

## తృతీయరంగము.

---

[రాయల రహస్యమందిర ప్రాంతము. ప్ర॥ తిమ్మరుసు]

తిమ్మ:—(స్వ) కళింగరాజ్యవిజయము శుభప్రదమైన తొలి పలుకు. కాని, నే విధించిన సంధినియమములకు గజపతి యొప్పుకొనడని తోచుచున్నది. గజపతి యను మాట యేల? రాజ్యతంత్రజ్ఞు డెవ్వడును ఒప్పుకొనడు!

(ప్రవేశము: నాగమనీడు)

నాగ:—మహామంత్రులకు నమస్కృతులు. శీఘ్రకాలములో మనకు పట్టమహిషి లభింపగలదను శుభవార్త మీరు వినియేయుందురు!

తిమ్మ:—(సాశ్చర్యముగ) ఏమీ! గజపతి సంధికంగీకరించి నాడా?

నాగ:—అదికాదు. గజపతికుమార్తెయగు అన్నపూర్ణాదేవి, రాయలను మనసార ప్రేమించియుండెను. మొన్న నే నేగినప్పు డామెదర్శనము లభించుట తటస్థించినది. అప్పు డామెచేటియువలన నావృత్తాంత మెరింగి, రాయలకు తన స్థితిని దెలుపుమని నన్ను వేడుకొన్నది. నేను రాయల కావార్త నెరింగించి, ఆమెచిత్రపటముగూడ నొసంగితిని.

కాని, యాతఁడిసుమంతయు చలింపక గంభీరముగ నూర
కుండెను. నిజముగ నీమెయే మనకు రాణియైనచో మన
మదృష్టవంతులమన్న మాటయే. ఈవిషయమున వీరారు
శ్రద్ధవహింపవలెను.

తిమ్మ:—అన్నపూర్ణాదేవి సౌందర్యగుణాతిశయము లీవరకే
నేను వినియుంటిని. ఆమెను రాయలకు గూర్పవలయు
ననియే, నాటినుండియు ఆలోచించుచుంటిని. గజపతి
తప్పక ఓడుననుసంగతి నెరింగియే, రాయలతో నీసంగతి
ప్రసంగవశమున అన్యాపదేశముగ సూచించితిని; నే డది
సంధినియమముగ విధించితిని.

నాగ:—అట్లైన మన యదృష్టము ఫలించినదన్నమాటయే!

తిమ్మ:—కాని యీవ్రణయవృత్తాంతము గజపతికి దెలిసి
యుండదు. రాయలన్నచో నాతఁడు భగ్గున మండిపడును.
అట్టిచో నీవృత్తాంతము దెలిసిన సహింపడుగదా!

(ప్ర॥ భటుఁడు)

భటు:—జయము జయము మహామంత్రులకు (అని లేఖ
నందించును) ఈలేఖను తమ కీయ ప్రభువులయాజ్ఞ.

(నిష్క్రమించును)

తిమ్మ:—(లేఖను పఠించుచు) ఓహో! గజపతి సంధి
కంగీకరించినాడు!

ఉ॥ మంతిరిరాయభార మది
మన్నదికిన్ సరిపోయె, సంధికై
కాంతను, కృష్ణరాయధర
కాంతున కిచ్చెద నడ్డులేక, సా
మంతుడనయ్యెదన్, పుడమి
మాన్యుల నెయ్యము రిత్తపోవునే
శాంతియొనర్చ రమ్ము, రిపు
సంఘవిదారక కృష్ణనాయకా॥

నాగ:—ఇంతకిన్న మనము కోరదగిన దేమున్నది?

తిమ్మ:—(చిరునవ్వుతో) నాయనా! ఉద్రిక్తుడవు గాకుము. జాగ్రత్తగ పరిశీలించిన నిం దొకకుట్ర ధ్వనించుటలేదా? నే నన్నపూర్ణాదేవిపరిణయమును శంకించుటలేదు. కాని, గజపతి కుతంత్రజ్ఞుడు. స్వార్థమునకై యెంతటినీచమున కైన నెనుకాడని తుచ్ఛుడు. ఏదో యొకవిధముగ రాయలను చంపదలచుకొన్నవాడు, నే డాతనికి తన కూతు నిచ్చి లోకువయగునా? నయ భయములచే నామెను లోగదీసి, శయనగృహమున రాయల చంపించిన నీవును నేనును చేయున దేమున్నది? తొలినుండియు నన్ను తప్పించి రాయల నొంటిగ చే జిక్కించుకొనుటకే గజపతి పన్నాగము. శయనగృహము చొరరానిదగుటచే నే డీ యెత్తు నెత్తియుండును. కాకున్నను మన జాగ్రత్తపై మనముండుట మంచిది.

(ప్రవేశము రాయలు)

తిమ్మ:—స్వామీ!

ఉ॥ కూతురుత్రోడిపెండ్లి పరి
గూర్పగ నేడు కళింగరాజు మీ
కు త్తర మంపినాడట, శు
భోదయ వేళ గణించి మీరు వి
చ్చేతుమటంచు బల్కిరట
చెప్పరిదేల? వివాహవేళ జా
మాతకు కట్న మెంతయొ, కు
మార్తెకు శుల్క మదెంతయో ప్రభూ॥

ఏ రాజ్యతంత్రజ్ఞుడును అంగీకరింపజాలని సంధినియమము లకు, గజపతి ఏ యుద్దేశము మనసులో నుంచుకొని యంగీక రించెనో యోచించితిరా?

ఉ॥ మంతనమందు దిట్ట, దుర
మందు జితుండు, తనంత వచ్చి, "సా
మంతుడనాడు, భూపునకు
మ త్సుత నిచ్చెద"నంచు బల్కి ని
శ్చింతను, సంధినీమముల
ఛిన్నమొనర్పగ తంత్రమేమొ! మీ
రంతయు నొక్కసారి మది
నారసియే బదులాడిరా ప్రభూ॥

రాయ:—(చిరునగవుతో) కళింగుని సైజము తెలిసియు, పరాజితుడౌట నేమియు చేయజాలడని, ప్రమాదమే వచ్చినచో అప్పాజి కలడను ధైర్యముచే, వివాహమున కంగీకరించితిని గాని, నే నెట్టియాలోచనమును గావింపలేదే!

తిమ్మ:—నాయనా! ముసలివానిమాటలకు మరియొకరీతి భావింపక నాప్రశ్నకు సమాధానమిమ్ము. ఇంతవరకు నీవును, నీప్రియురాలును పరస్పరవీక్షణములైనను గావించుకొనలేదు. ఆమె నిజముగ నిన్ను ప్రేమించె నను నమ్మకము నీకున్నదా?

రాయ:—అప్పాజీ! చెలికత్తెమాటలు గజపతికుట్రయే అనుకొందము. కాని, ఈ నాగమనీని రాయబారము నెట్లు సందేహింపగలము?

తిమ్మ:—నిజము. కాని, ఆమె శత్రురాజు కుమార్తె యను మాట మనము విస్మరింపరాదు. గజపతి యేమి చేసినను చేయువచ్చును. తొలుతనే మేలొ్కనుట మంచిది. కావున, శయ్యామందిరమునకు కవచధారివై పొమ్ము!

రాయ:—అప్పాజిసందియము ఆధారరహితము!

తిమ్మ:—క్రొత్తపెండ్లికొడుకు! నాయనా! పెంచినప్రేమగదా! నీ యశోవీచికలు దిగంతములు వ్యాపింపజేసి గర్వించుచు నేడు నిన్ను రక్షించుకొనుట నా బాధ్యతగాదా? ఈ

ముసలివాని యనుమాన నివృత్తికీపాటి సాయమొసర్ప నిరాకరింపకుము!

రాయ:—(చిరునగవుతో) అట్లే కానిందు (నిష్క్రమి)

తిమ్మ:—నాగమనీడా! ఒకవేళ మన మనుకొన్నట్లు జరిగినచో, రాయలు క్రోధావేశమున, నిరపరాధినియగు అన్నపూర్ణాదేవి నేమి చేసినను చేయవచ్చును. కావున, శయ్యాగృహపు రహస్యద్వారము బంధింపకుండున ట్లంతఃపుర పరిచారికల నాజ్ఞాపింపుము.

నాగ:—చిత్తము.

(తెర.)

---

## చతుర్థరంగము.

---

[స్థలము: శయ్యామందిరము. శయ్యపై నిద్ర నభినయించుచు రాయలు. అతనిపాదముల చెంత, చేత ఛురియ ధరించి నిలువబడి, అన్నపూర్ణ]

అన్న:—ప్రాణేశ్వరా! నావంటి యదృష్టహీనురాలి న వ్వరించి యీవరకు సృష్టించియుండబోడు. సకలరాజన్య మస్తకస్థగితరత్ననీరాజితచరణుండ వగు నిన్ను జెట్ట బట్టియు, పవిత్రమగు యాంధ్రచరిత్రమున, నీ రక్తముతో

నా క్రూరచరిత్రమును లిఖింప దొరకొంటిని. నా హృదయము నీవు గ్రహింపజాలితివా-ధన్యను (అని సమీపించి-పతిమోము వీక్షించి) ఛీ! అన్నపూర్ణా! మనసిచ్చి ప్రేమించి, పెండ్లియాడి, నే డిట్టి నీచకార్యమునకు బూనుకొంటివి! ఒకని మాటకై, హృదయేశ్వరుని చంపి, హిందూస్త్రీ ధర్మమున కాతటికళంక మాపాదింపనుంటివి!......... దైవమా! న న్నెంతకఠినముగ పరీక్షించుచుంటివి!...... ఆచంద్రార్కము తెలుగువారు నన్ను తలచుకొని తిట్టి పోయుదురే!......నా మనసు గ్రహింపజాలు మేధావులు శతాబ్దికొకరు రావచ్చును......ప్రేమను... పతిత్వమును ఎట్లో చంపుకొందును...కాని...కాని... స్త్రీత్వము నెట్లు చంపుకొందును?...హత్య! రక్తము... ఓః! (ఊరకుండి)......పవిత్ర క్షత్రియకుటుంబమున జన్మించి, ఆడినమాటను తప్పగలనా?......గజపతీ! రాజ్యాపేక్ష చేసి, యెంత ఘోరమున కొడిగట్టితివి!...... (శయ్యను సమీపించి) హృదయేశ్వరా! ఇహలోకమున మన కిదే తుదిదినము. పరమేశ్వరు డనుగ్రహించెనా, పరలోకమున నిను జేరెదను. నా కడసారివందన మందుకొమ్ము! (అని పొడువబోవ, రాయలు లేచి కర కర వాలముల బట్టుకొని, చేత ఛురియ లాగికొనును. అన్నపూర్ణ మూర్ఛిల్లును.)

రాయ:—(క్రోధావేశమున) పాపాత్మురాలా! విరహతప్తవై చచ్చుచున్నట్లు ప్రణయవార్తల నంపి, తుదకు నీ తండ్రి కసాధ్య మగు నీ పని జేయ సమకట్టితివా! నిన్ననవల సినపని యేమున్నది? తొలుతనుండియు నీ తండ్రి నైజ మెరింగియు నీ మాయలో చిక్కిన నన్ను నేనే నిందించు కోవలెను. అప్పాజీ! నీ సహాయమునగదా నేడు నా జీవ ములు నిల్చినవి. పాతకీ! నీ శిరమునే నీ తండ్రికి కానుకగా నంపెదను. ఎవ్వ డడ్డుపడునో చూతును. (అని పొడువ బోవ, రహస్యద్వారము తెరచుకొని తిమ్మరుసు ప్రవే శించి, వెనుకనుండి రాయలకరము బట్టుకొని)

తిమ్మ:—నాయనా! కొండరపా టేరికిని తగదుసుమా!

రాయ:—(నివ్వెరపాటున) అప్పాజీ!

తిమ్మ:—(చిరునగవుతో) నాయనా! నీ పరాక్రమము నిష్క ళంకచరితయగు నొకయబలపైనా?

రాయ:—అప్పాజీ! క్షమింపుడు. ప్రణయము ప్రణయమో యని కులికి కతిప్రాణములకే నీళ్ళుతోడు రాక్షసి యెట్లు నిష్కళంకచరిత యగునో యీబుద్ధిహీనునకు గోచరింప కున్నది!

అన్న:—(తెలివి నంది) ప్రాణేశ్వరా! ఇంకను ఆచేతిని దింప రేల? తమ ప్రాణముల బాధ నుంకించిన కృతఘ్నురాలిని చంపక వెనుకాడెద రేల?

తిమ్మ:—(వారించి) బిడ్డా! విచారింపకుము. నా కంతయు దెలియును. (రాయలవంక దిరిగి) నాయనా! నిజముగ నీమె యే పాప మెరుగదు. దీనికి మూలకారకుడు గజ పతి. ఏ నా డతడు సంధికంగీకరించెనో నాడే నా కను మాన ముదయించినది. ఈవిధముగ దప్ప అతనిచేతికి నీ వొంటిగ జిక్కవుగదా! ఇది యనుమానించియే, తొలుత నీకు కవచధారణ మొనర్చి మరల నీమెను గాపాడుటకై, యీ రహస్యద్వారమున వేచియుంటిని.

రాయ:—అప్పాజీ! నీ వన్నదంతయు సత్యమే కావచ్చును. కాని, నా ప్రశ్న అదికాదు. ఆ మూర్ఖు డీమెను ప్రోత్స హించినపు డీమె ప్రేమయంతయు నే యేట గలిసినదని.

తిమ్మ:—అభిమానముగల యాడుదాని కొకమాట చాలదా?

రాయ:—ఇంకను ఈమె నిష్కళంకచరిత యనియే మీ నమ్మకమా?

తిమ్మ:—నిశ్చయముగ! అంతే కాదు. ఇప్పటికిని నిన్నీమె మనోవాక్కాయకర్మల ప్రేమించుచునే యున్నది. నాయ నా! ఇట్టిహృదయములు సులభముగ నర్థముగావు. ఒకని చర్యలనుబట్టి వానిహృదయము నిర్ణయింపజాలము. పరి స్థితులు విషమించిన యెంతమహాత్తముడైన నీచముగ బ్రవర్తింపక తీరదు. అట్టివారి దేదో యొకచర్య నాధార

ముగ జేసికొని వారిని నిరసించుట దోషము. తక్కినవరి స్థితులుగూడ పరికింపవలెను.

ఉ॥ చిన్నది; శత్రురాజు వను
చింత యొకింతయు లేక నిన్ను చే
కొన్నది; నిన్ను జేర తన
కూరిమిబందులనెల్ల నేడు పీ
డ్కొన్నది; కాలపుంగతిని
కూరిమిజూపుట తప్పెగాని, యీ
పిన్న దనింద్య; ఈమె నిక
ప్రీతి గ్రహింపమి దోషమౌను సు
మ్మన్నడు తొంటిచింత నిజ
మేర్పడజూపదుసుమ్ము నాయనా!

రాయ:—అప్పాజీ! నే డెంతటి యవాంతరము దాటించితివి? నీవు లేకున్న, నిర్మలహృదయ యగు నీమెను పోగొట్టుకొనియుండెడివాడనుగదా!

అన్న:—(బాష్పలోచనయై) ప్రాణేశ్వరా! ఇందు నా తండ్రి దోష మే మున్నది? ఈ తప్పంతయు నాది! నేను రాజ్ఞీత్వమున కనర్హను. తమప్రభువును చంప నుంకించిన రాకాసి యని పేరువడి, ప్రజలలో మాతృభావ మెట్లాపాదింపగలను? కావున, మీ చేతులతో నే చంపి ధన్యనొనర్పుడు.

తిమ్మ:—బిడ్డా ! విచారింపకుము. తొందరపాటంతవారికైన గలుగును.

ఉ॥ ఈ సువిశాలరాజ్యరమ
కీ వయి రాణివి; నిస్తులప్రభా
భాసితుడౌ మహీపతికి
పత్నివి; తల్లివి తెల్గువారికిన్
నీ సుగుణాళి నీ విధులు
నిత్యము దోహదమంద; కీర్తిని
న్వ్యాసిని గాంచుచుండ ధర
వర్ధిలు మమ్మరో ! అన్నపూర్ణవై ॥

రాయ:—(ఊరడించుచు) దేవీ ! నా తొందరపాటును క్షమియింపుము. నేడు మన మానప్రాణములు గాపాడిన యప్పాజిఋణము కృతజ్ఞతాపూర్వకనమస్కృతులతో చెల్లింతము రమ్ము.

(ఇరువురు తిమ్మరుసుకు నమస్కరింతురు.)

తిమ్మ:—(చిరునగవుతో) శీఘ్రమే సుపుత్రావాప్తిరస్తు !

(తెర)

# తిమ్మరుసు

## చతుర్థాంకము.

### మొదటిరంగము.

[ప్రవేశము॥ ఇద్దరు పురజనులు: రాజబాటలో]

మొ॥ పు॥ జః—అయితే బాలరాజుగారికి రేపే పట్టాభిషేక మన్నమాట! ఇంత చిన్నవయసులోనే యువరాజపట్టాభిషేకం తలపెట్టేరేంచెప్మా!

రెం॥ పు॥ జః—అప్పాజిబాబుగారి ప్రోత్సాహంచేత. ఆయనకూ వృద్ధాప్యంవచ్చిందా? ఏదో బతికుండగానే మనుమని పట్టాభిషేకం చూదామని ముచ్చటపడ్డారట. మరి రాజుగారికి ఆయనమాటంటే గురేకదా!

మొ॥ పు॥ జః—అలాగే! అలాగే! నిజానికి చర్మం చెప్పులు కుట్టి యిచ్చినా, అప్పాజిబాబుగారిఋణం తీర్చుకోగలరా రాజుగారు? అసలు ఏ తెలుగువాడు తీర్చుకోగల డని!!

రెం॥ పు॥ జః—కాదుటండీ! ఆ మేధాశక్తికి ఏ మంత్రి అందుతాడు!

మో॥ పు॥ జ:—అయితే రేపు హడావిడంతా ఆయనదే అన్నమాట!

రెం॥ పు॥ జ:—మంత్రి, రాజూ, యువరాజునా మరి! తాత, తండ్రి, మనవడు ఆమెరి. మరి తాతకు కాకపోతే హడావిడి ఇం కెవరికి? అయితే చూసేరూ, రాజుగారికి ఆయన మీాద భక్తి అలా ఉంచండి. అది సహజమే. అల్లా వుండకపోతే ద్రోహంకూడాను. కాని, దేవిగారో! ఆవిడ కన్నతండ్రికన్న ఎక్కువగా చూస్తుందికదూ ఆయన్ను!

మో॥ పు॥ జ:—మరి కాపురం నిలబెట్టిం దెవరయ్యా! అప్పాజిబాబు లేకపోతే ఆవిడగతి ఏమైయుండును?

రెం॥ పు॥ జ:—కాకున్నా, మొదట ప్రజలంతా దురభిప్రాయపడ్డారుగాని... ఓహెూ! సాక్షాత్తు అన్నపూర్ణాదేవి కాదండి! బ్రహ్మ మహా చక్కటిరచన చేసేడు వారి దాంపత్యంలో!

మో॥ పు॥ జ:—ఆఁ!... మరి సెలవు... రేపు సభామంటపములో కలుస్తారా?

రెం॥ పు॥ జ:—సరే! అదోమాటా! ఈ ఆనందం, అనురాగం రాజుకీ మంత్రికీ ఏముందండీ! ఇదంతా మనది!!



## ద్వితీయరంగము.

[నాటిసాయంకాలము—ఉద్యానవనము—రాజు, రాణి యువరాజు]

రాణి:—ప్రాణేశ్వరా! రేపేకదా చిరంజీవికి పట్టాభిషేకము! నా చిన్నిరాయలు సింహాసనారూఢుడై బాలసూర్య తేజముతో ప్రకాశింప తెలుగువా రెంత మురియుదురో గదా!...సింహాసనము వీడి నా యంకసీమ జేరునపుడు... అబ్బ!...... (గగురుపాటు నభినయించును)

రాజు:—దేవీ! అప్పాజితొందరచే నిప్పుడు పట్టాభిషేకమును తలపెట్టితిని గాని, వీని కున్న స్వశక్తి యేమి?

రాణి:—(చిన్నబోయి) ఔనులెండు! చిరంజీవి మీ వలె శక్తియుతుడగుట మీ కిష్టము లేదు కాబోలు!

రాజు:—(నవ్వుచు) దేవీ! పరిహాసమున కన్నమాటలు నిజమని భావింతువా? ఆతడు చూచుటకు నన్ను బోలినను గుణములకు గజపతివంశస్థుడేమో యను అనుమానము దోప నట్లంటిని!

రాణి:—(బాష్పలోచనయై) హృదయేశ్వరా! ఇన్నిదినములయ్యు నా మనము కనిపెట్టలేకుంటిరిగదా! ఈపరీక్ష కంతము లేదా?

రాజు:—(రాణిని కౌగలించి మృదువుగ చెంపపై జరిచి లోనికి గొంపోవును) (తెర)

## తృతీయరంగము.

[ఉదయము: పట్టాభిషేకదినము: అతిథిమందిరము: గజపతి]

గజ:—(తనలో) రాయలరక్తము జూచి యానందింపవలసిన గజపతి, అతని కుమారునిపట్టాభిషేకమున పాల్గొన వచ్చినాడు!... రాయలరక్తము!... ప్రతీకారము... గజపతీ! ప్రతీకారసమయ మాసన్నమైనది!... ఆహా! కన్నబిడ్డయే నా శత్రువుని జేరినదిగదా! నేడు తన్ను చూడగోర నిరాకరించినదే! కన్నతండ్రి యను గౌరవమైన లేకపోయె! నా కేల యీ మమకారము?... గజపతిలో మానవత్వమున్నదా? ... అది పూర్తిగ నశింపవలెను. ప్రతీకారవాంఛ ప్రబలతరమై హృత్కోశమున ప్రళయకాలఝుంఝూమారుతమును రేకెత్తుచున్నది! రాయలవంశము నిర్మూలముగావలెను! అందులకే గజపతి జీవించి యున్నాడు. మొదట బాలకుని చంపవలెను ... అది తొలిరంగము... తిమ్మరుసుముద్రిక సంగ్రహించి, హత్యకై కసాయివాండ్రకు పారితోషిక మీయ నొప్పుకొన్నట్లొక మిథ్యాకృత్రము సృష్టింపవలెను... నేడెల్ల బాలకుని తిమ్మరుసు వెన్నంటి తిరుగుచుండును... పరిస్థితులు చక్కగ సమకూడినవి ... రాయలు మూర్ఖుడు! ... తిమ్మరుసు యొక్క నీడ!...తిమ్మరుసు లేనిచో రాయలకు వ్యక్తిత్వము లేదు... ఇది నే నాడబోవు నాటకమునకు సూత్రము...

తిమ్మరుసుపై హత్యానేర మారోపింపవలెను!... తిమ్మరుసు పతనము చూచితినా, విజయనగర రాజ్యమునకు మంగళము పాడితినన్నమాటయే! (నిష్క్రమించును)

(ప్రవేశము—తిమ్మరుసు)

తిమ్మ:—(తనలో) మర్యాదకై ఆహ్వానపత్రిక పంపినను రాడనుకొన్న గజపతి వచ్చినాడు. అభిమానముగల క్షత్రియుడు చేయనిపని చేసినాడు. ఇంకను పరిభవాగ్ని ఆరలేదన్నమాట! నేడు దేవి చూడ నిరాకరించుట, మరల నా యగ్ని ప్రజ్వరిల్లకమానదు. ఇప్పుడీతనికత్తి చిరంజీవిపైనా? రాయలపైనా? రాయలపై నని తోపదు. చిరంజీవిని చంపినచో శోకాతురు డగు రాయలు తన కొంటిగ జిక్కు నని కాబోలు వీనివెఱ్ఱి. శేముషీధురంధరు డగు గజపతి, అప్పాజిని విస్మరించినాము. బ్రతికియున్నంతకాలము, చిన్నిరాయలకు తిమ్మరుసు శ్రీరామరక్ష!

ఉ॥ వీరనృసింహరాయపృథ
వీపతి నిల్పిన ఆంధ్రరాజ్య మిం
పారగ కృష్ణరాయమహి
తాత్ముడు పెంచి యశమ్ము నించె దో
స్సారవిదారితారిబల
సారముగా, నది వృద్ధిజెంద, ధీ
సారము ధారవోసెదను
సమ్మతి రాయకుమారు డేలగా॥

(నిష్క్రమించును) (తెర)

## చతుర్థరంగము.

---

[రాత్రి మూడవఝాము: శయ్యపై రక్తస్రవంతీమధ్యమున యువరాజుశవము: ప్రక్క నిదురించుచున్న దాసి లేచి, శవము జూచి]

దాసి:—(బిగ్గరగ) హత్య! బాలరాజుగారు చంపబడిరి!!

(ప్రః వేర్వేరుదిక్కులనుండి, రాజు, రాణి, తిమ్మరుసు)

ముప్పురు:—ఎచ్చట?!!

రాణి:—(శవముకడ మూర్ఛిల్లును)

రాజు:—ఉ॥ దిక్కతివోయెనే పుడమి
ధీవరు డొక్కడు లేక, రేయి ని
న్నక్కటికంబు వీడి దను
జాత్మకు డల్లన ద్రుంచువేళ, "నీ
వెక్కడ నుంటివో జనక!
ఎచ్చటి కేగితి వమ్మ" యంచు మ
మ్మొక్కర గానరాక, వధ
కోర్వక కుందెడి నాదు పుత్రికా॥

వైభవోపేతముగ పట్టాభిషిక్తుడవై తుద కొంతటి నీచపు చావు చచ్చితివోయి తండ్రీ! నీ సుకుమారగాత్ర

మేదుష్టుని కన్నులు కుట్టెనో గదా! నావంటి యదృష్ట హీను డిక పుట్టునా, అప్పాజీ?

తిమ్మ:—(తనలో) ఆహా! వీరిశోకముకన్న నా హృదయ మెంత పరితపించుచున్నదో భగవంతునికే తెలియును. అప్పాజీ! తెలిసియుండియు నీ తెలివి యిట్లు తెల్లవారిన దేమి? నీ రాయలను కాపాడుకొనజాలని నీ బుద్ధి ఏల?

రాయ:—అయ్యో! తండ్రీ! ఆంధ్రరాజవంశోద్ధారకుడ వగుదు వని యువ్విళ్ళూరు నీ తల్లి నే మని యూరడిం తును?

తిమ్మ:—నాయనా! విధికృతము దప్పింప నెవరితరము? దీనిని గావించిన దుర్మార్గు లెవ్వరో రాజ్యాపేక్షచే జేసిరి గాని మరియొండు గాదు. వా రెవ్వరో కనుగొన ప్రయ త్నింపవలెనుగాని విలపించి ప్రయోజన మేమి?

రాయ:—అప్పాజీ! సర్వకళాప్రపూర్ణు డగు బాలకుని పో గొట్టుకొన్న నా కింక యీ రాజ్యముతో నేమిపని? ఆహా! దుర్మార్గులారా! రాజ్యాశచే నీ పని గావించినచో నన్నే చంపకపోయిరా? ఈ పసికూన మీ కేమి యప కార మొనర్చెను?

తిమ్మ:—నాయనా! ఊరడిల్లుము! ఈ హత్య నెవ్వరో పెద్దమెత్తు నెత్తి యొనర్చినట్లున్నది. మహామేధావియైన గాని ఇట్టిపరిస్థితులలో నీ పని గావింపడు.

రాయ:—(రోషకషాయితనేత్రుడై) అప్పాజీ! ఈ పని గావించిన దెవ్వరో శేపే తేలవలయును! నిన్న నెల్ల కుమారుని విడువక తిరిగిన దెవ్వరు?

(ఇద్దరు గజపతి, నాగమనీడు వేర్వేరు దిక్కులనుండి)

గజ:—హా! కుమారా! నా కడపటిదినములు నీ బాల్యచేష్టలు జూచి గడుపుకొందు మనుకొంటిని! విధి యెంతటి దుష్కృత మొనర్చినది!

రాయ:—(పరల గట్టిగ) నిన్న నెల్ల కుమారుని విడువక తిరిగిన దెవరు?

గజ:—తిమ్మరుసు.

రాయ:—తిమ్మరుసు !!

తిమ్మ:—తిమ్మరుసు.

నాగ:—(స్వ) ఇది మరియొకనాటకము! అప్పాజి అనుకొన్నంత యైనది! తప్పించుకొనజాలని పరిస్థితులలో నప్పాజి నిరికించి గజపతి నేర్పుగ నెత్తు నెత్తినాడు. (పైకి) ఇట్టి ఘోర మగు నిం దారోపణము చేయునపుడు పిన్న పెద్దల తారతమ్యము గమనింపవలెను.

గజ:—మహామహు డగు అప్పాజిపై నిందారోపణ మొన ర్చుటలో నా కున్న బాధ్యత గుర్తింపకపోలేదు. అను మానము నాధారము జేసికొని నే నీ పని గావించుటలేదు.

నాగ:—ఇప్పు డీ వట్టిమాటలతో నిది తేలిపోదు. నేరము ఋజువు చేయజాలనినాడు నీ స్థితి యే మగునో తెలియ లేకున్నావు. ఇప్పుడైన అప్పాజిక్షమను వేడుకొనుము!

గజ:—సేవకులకు సమాధానము చెప్పుకొనవలసిన యగత్య మింకను గజపతికి పట్టలేదు. ప్రస్తుతము నీవు నోరు మూయుము.

కృష్ణ:—అప్పాజి ననుమానించువారు మా సమక్షమున నుండ ననర్హులు!

గజ:—నాయనా! శోకాతురుడవై నిజ మరయ లేకున్నావు. నాకు కొంతవ్యవధి యొసగినచో, అప్పాజిదోషము నిరూపింపగలను.

కృష్ణ:—మామవై బ్రతికిపోయితివి! రేపు నీ మాట కాపాడు కొనజాలనిచో నీ ప్రాణములు దక్కవు.

గజ:—(చిరునగవుతో—తిమ్మరుసును జూచుచు నిష్క్ర)

రాయ.—(తిమ్మరుసును చురచుర జూచుచు నిష్క్ర)

తిమ్మ:—గజపతి నాపై నిం దారోపణ మొనర్చినాడు-రాయ లంగీకరించినాడు! ఇప్పు డీ దోషము నెట్లు గజపతి నిరూపించునో చూడవలెను. ఇది ఆఖరియెత్తు. మంత్రి, రాజు ఎదురుగళ్ళలో నున్నారు; ఎత్తు గజపతిది! మంత్రి ఏ మగును? (తెర)

## పంచమరంగము

[చేత పత్రము బట్టుకొని రాయలు]

రాయ:—ఈ పత్రముకన్న అప్పాజిదోషమునకు ప్రబలతర సాక్ష్య మిం కేమి కావలెను? కసాయివాండ్రి నెంత నిర్బంధించినను అప్పాజియే తమ్ము ప్రేరేపించె నని పలుకుచున్నారు. కాని, ఎన్నినిదర్శనము లున్నను, తండ్రి నెట్లు చంపగలను?...అప్పాజీ! నే నేమి చేసితి నని నాపై నీ కింతపగ! నన్ను పెంచినచేతులతో ఆ బాలకు నెట్లు చంపగలిగితివి! నీవు నా కొనర్చినదెల్ల విస్మరించి, నే డెట్లు నిన్ను శిక్షింతును! శిక్షింపకున్న నృపధర్మము వీడితి నను కళంకము వాటిల్లకమానదుగదా!...అయ్యో! అప్పాజీ! హత్యయొనర్చి ఎచ్చటికైన పలాయనమొనర్పక, న న్నింత బాధాకర మగు స్థితి నిరికించితివి!...ఇక తప్పదు!...అప్పాజీ! న న్నేల రాజం జేసితివి?...చేసి నే డేల యిట్లు వర్తించితివి!...

(ప్రవేశము : గజపతి)

గజ:—నాయనా! గతము మఱచిపొమ్ము! అప్పాజి దోషి యైన గావచ్చును! కాని, ని న్నింతవానిగ జేసినవాని నెట్లు శిక్షింతువు? ప్రజలు, నృపధర్మము వీడితి వని దూరిన దూరనిమ్ము! అప్పాజినిమాత్రము శిక్షింపకుము!

రాయ:—మామా! అ దేటిన్యాయము? దోషి యని నిదర్శనము లెన్నియో కన్పట్టుచున్నవి. నిర్దోషి యని నిరూపించుటకు శక్తి లేదు. దోషి యని యంగీకరించి, శిక్షింపకుండ నె ట్లుండును? మామా! ఈ నిదర్శనములు కప్పిపుచ్చ లేమా?

గజ:—నాయనా! లోక మంతటికిని వెల్లడియైనపిదప నిక నెట్లు దోషము కప్పిపుచ్చగలము! అది మరింత యవమానకరము! వాటిని తిరస్కరించుటకు సాక్ష్యము లేదు. న్యాయముగ శిక్షింపక తప్పదు! కాని... శిక్షకు నా మన మంగీకరింపకున్నది! కాని, ఏమి చేయగలము!

రాయ:—అయ్యయ్యో! అప్పాజి తను దోషి ననిగాని, నిర్దోషి ననిగాని ఒక్క మాటయైనను మాటాడడే!

గజ:—వెఱ్ఱివాడా! ఇంత ఘోర మొనర్చి ఇంకను ఎట్లు మాటాడగలడు? ఆతనిమౌనమే మాటాడుచున్నది!

రాయ:—(దృఢచిత్తముతో) మామా! అప్పాజి, నా కెంత మేలు చేసినను, నేడు దోషి! నేను ప్రభువును! ఆతని శిక్షింపక తప్పదు. వలసిన శిక్షించి దుఃఖింతునుగాని నృపధర్మము విడజాలను! ఇప్పుడే సేనానాయకుని తిమ్మరుసును బంధించి సభకు గొనిరా బంపెదను!

(నిష్క్రమించును)

గజ:—బుద్ధిహీనుడా! శిక్షించినపిదప దుఃఖించుటకు నీకు కన్నీ రెక్కడిదిరా! ఓ నృపధర్మదేవతా! నావంటివారల కెంతసహాయ మొనర్చుచుంటివి! నీ రూప మే మూర్ఖుని విలాసమోగాని, కొనియాడదగినది!

(నిష్క్రమించును) (తెర)

---

ఆఱవ రంగము.

---

[ప్రవేశము: నాగమనీడు: చేత నాజ్ఞాపత్రముతో]

నాగ:—చ॥ అలఘు సుధీ విశేష సను

దంచిత దీప్తులవెల్గు నందుగా

తొలి సచివుండు; నేడు తన

దోషము లేకయె బంధితుండు గా

వలసిన నీచపుం దశకు

బాల్పడె! పాములతోడి పొందుగా

యిల నరపాలురన్ గొలుచు

టేరికినైన నను యెంచి చూడగన్॥

ఆహా! కృష్ణరాయా! పెంచి పెద్దజేసిన విశ్వాస మిసు మంతయు లేక, యొకకుచ్ఛితుని మాయోపాయమున

జికిఁ, పితృసమాను డగు అప్పాజిని నేడు సామాన్య నేరస్థునివలె బంధింప నాజ్ఞాపించిన నీ బుద్ధివిశేషము నే మనవలెను? నీ కాత డొనర్చినసేవను స్మరించియైన క్షమించుబుద్ధి లే దేమి? రాయచూరు ముద్గల్లున మ్లేచ్ఛ రాజుల ఘోషింపజేసినదానిలో నీ దోష మెన్నవవంతు? తండ్రి చనిపోయి దిక్కుఁ లేక అల్లాడునప్పుడు చేరదీసి, పెంచి, పెద్దజేసి, నీకై తన సర్వస్వము ధారవోసి, మహా సామ్రాజ్యాధిపత్య మాపాదించి, సకల దిక్కుఁన్యలచే నీ రాజన మెత్తించిన శక్తిలో నీ దోష మే మూల నిలు చును? నాడు శయ్యామందిరమున నీ వలపుకత్తెచే చావ వలసిననాడు నిను రక్షించి, వంశము నిల్పినసేవలో నీదోష మేపాటిది?...ఛీ! నీవంటి కేని గొలుచుకన్న బిచ్చ మెత్తుకొనుట మేలు!

(నిష్కుఁ)మించును.)

(తెర)

## ఏడవ రంగము.

---

[తిమ్మరుసుమందిరము—తిమ్మరుసు ఆలోచించుచు కూర్చుండి యుండును. మోమున విషాదరేఖలు లేక గాంభీర్యము తాండవమాడుచుండును.]

(ప్ర॥ నాగమనీడు)

నాగ:—మహామంత్రులకు నమస్కృతులు.

తిమ్మ:—(ఆసనము జూపును. నాగమనీడు కూర్చుండును) నాగమనీడా! నాటినుండి నేను కోటకు బోవుటలేదు. నా రాజు కుశలుడా? పుత్రమరణసంజనితశోకావేశము తగ్గినదా?

నాగ:—(స్వ) ఆహా! ఈయనవాత్సల్యము తరుగని గనికదా! ఇపు డె ట్లీయనను బంధింతును?

తిమ్మ:—నాయనా! మాటాడ వేమి? ఎవ్వరికి నే యాపద రాదుగదా?

నాగ:—రా కేమి? ఆంధ్రమహాసామ్రాజ్యరక్షాదక్షునకే ముప్పువచ్చినది!

తిమ్మ:—(ఆత్రముతో) ఏమీ! నారాయ...

నాగ:—అమంగళము శాంతించుగాక! అప్పాజీ! గజపతి నిందారోపణ రాయ లంగీకరించినాడు! నేడు మిమ్ము బంధించి సభకు గొనిరమ్మని న న్నంపినాడు.

తిమ్మ:—(నిట్టూర్పువిడచి) ఇదియా! ఏమో యనుకొంటిని. న న్నెంత యాందోళన పరచితివి! కానిమ్ము. రా జాజ్ఞ శీఘ్రముగ నేరవేర్పుము! నా రాజు కుశలుడైనచో నాకు గావలసిన దే మున్నది?

నాగ:—(కోపముతో) అప్పాజీ! తొలినుండియు మీ రిట్లే ప్రవర్తించుచున్నారు! మీ మూలముననే గజపతి కీ యవకాశము లభించినది. మీ ధైర్యమేమో నా కర్థ మగుటలేదు. మీయట్టివాత్సల్యఖనిని శిక్షింపబూను కొన్న యీ రేని నేమని కొలుతును? చివరకు రా జింత బుద్ధిహీను డైపోయినా డేమి?

తిమ్మ:— నాయనా! అకారణముగ రాజు నేల నిందింతువు? రా జాజ్ఞ నేరవేర్ప మనవిధిగాని, తర్కించుటగాదు. మనకర్మఫల మిట్లుండ రా జేమిచేయుగలడు?

నాగ:—అప్పాజీ! సర్వము నెరింగియు నిట్లు పలికెద రేల? వేరుపురుగువలె గజపతి కోటలో ప్రవేశించినాడు. తక్ష ణమే పోయి వానిని వధింతును. (అని పోబోవ)

తిమ్మ:—(వారించి) నాయనా! తొందరపాటేరికిని కూడదు. కొలదికాల మోపికబట్టినచో నిజము తేలకపోవునా?

నాగ:—(కోపముతో) అప్పాజీ! న న్నడ్డుపెట్టవలదు. నే నేమైనను వానిని వధించి నిను రక్షించుకొందును! (అని పోవుచుండును)

తిమ్మ:—మూర్ఖా! నిలువుము! నీమాత్రపుబుద్ధి మాకు లే దనుకొంటివా? సేనానాయకా! రా జాజ్ఞ నెరవేర్ప మంత్రి ని న్నాజ్ఞాపించుచున్నాడు!

నాగ:—(నీరవృత్తి—తిమ్మరుసును బంధించును.)

(తెర)

---

## ఎనిమిదవ రంగము

---

[రాణి: దుఃఖించుచు—దాసి: ఓదార్చుచు]

దాసి:—అమ్మా! ఊరక విలపించి ప్రయోజన మేమి? నేర స్థుని మీ నాయనగారు పట్టుకొన్నట్లు కోటలో చెప్పు కొనుచున్నారు. ఊరడిల్లుడు.

రాణి:—ఇక నీ జన్మమున కూరటగూడ నెక్కడిదే! అమ్మో నా చిన్నితండ్రీ! నిన్ను వధించుట కే క్రూరునకు చేతులు వచ్చునోయి! రెం డడుగులు వైచిన కందిపోవు నీ శరీర మా ఖడ్గఘాత మెట్లు భరించినదోయి! ఆ దురాత్ముడు నిన్ను బాధింప, "అమ్మా! అమ్మా!" యని ఈ యదృష్టహీనురాలి నెంతగా పిలచి నిరాశుడవైతివోగదా!

దాసి:—అమ్మా! ప్రభువులు వచ్చుచున్నారు.

(ప్రవేశము:—రాయలు)

రాణి:—(పొంగివచ్చు దుఃఖముతో) ప్రాణేశ్వరా! గొడ్డుపోయిన యీ యంతఃపురమున కేలవచ్చితిరి? ఎంతలో నా యంకసీమ రిక్తమైపోయినది! ఇక మీ చేతి కెవ్వని నందించి మురియుదును?

రాయ:—(స్వ) ఈమె నిప్పుడే మని యూరడింతును? మనసు నెంత దృఢపరచుకొన్నను యామెంగాంచినతోడనే నీరైపోవుచున్నది! (పైకి) దేవీ! ఊరడిల్లుము! మన మిక చేయజాలినది శిశుహంతకుని శిక్షించి, కుమారుని యాత్మకు శాంతి చేకూర్చుట తప్ప వేరేమిగలదు?

రాణి:—(శాంతించి) నాథా! హంతకుని నాయనగారు పట్టినట్లు చేటి చెప్పినది. అత డెవ్వరు?

రాయ:—దేవీ! ఇంతకాలము నంధుడనై ఇంటనున్న శత్రుని తెలియలేనైతి. ఈ వధకు కారకుడు అప్పాజీ!

రాణి:—(సాశ్చర్యముగ) అప్పాజియా! నాథా! అంతటి మహామహు డిట్టిపని యొనర్చునా! అన్నియు మీరు జాగ్రత్తగ నాలోచించియే నిందారోపణ నొప్పుకొంటిరా? నా మనసుమాత్ర మాయన దోషియని నమ్మజాలకున్నది.

రాయ:—దేవీ! తొలుత నేనును నీ వలెనే భావించితిని, కాని, నిదర్శనము లెన్నియో గన్పట్టుచుండ నే నెట్లు కాదందును? అతనిముద్రికతో నున్న, వధకు సంబంధించిన పత్రమొకటి లభించినది! ఇంతకన్న వేరేమి కావలెను?

రాణి:—ఆహా! అప్పాజీ! ఆదినుండియు మూర్తీభవించిన గుణపుంజమవై, ముసలికాలమున నొకబాలకుని వధించి ఏమి కట్టుకొని పోద మనుకొంటివోయి!

ఉ॥ పాపము పుణ్యమున్ గనని
బాలుని జంపగ నీకు చేతు లె
ట్లోపెర! "తాత, తాత" యను
చూరక బాలుని ముద్దులాడ, యే
భూపుని జేతువో యనుచు
పొంగితి గాని, కుమారువైభవ
మ్మాపుదు విట్లు లంచు గన
నైతిర! పాపము పండిపోయెరా॥

రాయ:—అప్పాజీ! రాజ్యమే వలసినచో వాడు నా తండ్రి నన్ను నీ కప్పగించినప్పు డేల చంపవైతివయ్యా!

రాణి:—నాథా! నా డాతడు వచ్చి కుమారు నెత్తుకొని, "చిన్నిరాయలవారు రేపు సింహాసన మధిష్ఠింతురు గాబోలు" నని ముద్దులాడ నేమో యనుకొంటినిగాని, యింతటివాడని యెంచనైతిని.

(ప్రి॥ చెలికత్తె)

చెలి:—దేవా! సభామంటపమునకు విచ్చేయు గజపతిప్రార్థన.

రాయ:—మంచిది. దేవీ! శీఘ్రముగ సభ ముగించి వత్తును. దుఃఖింపకుము. (నిష్క్రమించును.) (తెర)

# తిమ్మరుసు

## పంచమాంకము.

### మొదటిరంగము

[రాయలసభ: ప్రాడ్వివాకులు: నాగమనీడు: బంధితు డగు తిమ్మరుసు.]

రాజు:—నేరస్థుడా! నీ నేరము మాకు నమ్మకము కలుగునట్లు ఋజువైనది. ఇందులకు నీ వేమి చెప్పుకొందువు?

తిమ్మ:—(మౌనము)

రాజు:—మౌన మంగీకారసూచకమా?

నాగ.—ప్రభూ! అప్పాజి నేరమున కాధార మెద్దియో నే నడుగవచ్చునా? మహాబలవత్తరమగు సాక్ష్యమున్నగాని ప్రజ లెవ్వరును అప్పాజి నేరస్థుడని నమ్మజాలరు.

రాయ:—ఈ పత్రముకన్న నేరస్థునిదోషమునకు ప్రబలతరసాక్ష్య మింకేమి కావలెను? ఇది నేరస్థుని ముద్రిక యగునో కాదో పరిశీలించుకొనవచ్చును.

నాగ:—(పత్రము గైకొని, పరిశీలించి) ఇది అప్పాజిముద్రిక కాదనజాలను. కాని, అప్పాజియే నిజముగ నీ వాక్య

గావించినచో తనముద్రిక నిచ్చి పత్రము లిఖించునా? రాజా! ఇదియంతయు నొకకుట్రవలె నున్నది. అప్పాజి నిర్దోషియని నా నమ్మకము. తొందరపడి కృతఘ్నుడవు గాకుము.

రాయ:—ఎంత ధీశాలియైనను అప్పాజియు మానవుడే. తప్పొనరించుట మానవసహజము. అట్టిచో అప్పాజిని విడిచిపుచ్చి నా నృపధర్మము నెట్లు విడనాడుదును?

నాగ:—నీ నృపధర్మపాలన మెంత చక్కగనున్నది! కృష్ణ రాయా! ఇంతకాలము ధర్మమూర్తివని కీర్తినంది, నేడను మానమాత్రమున నొకమహానుభావుని శిక్షింపబూను కొంటివి. నీ...

రాయ:—ఇక చాలును. కట్టిపెట్టుము! నీవు మాకు రాజనీతి నేర్ప నవసరము లేదు.

నాగ:—ఛీ! రాజా! ఇంత కాలము......

తిమ్మ:—నాగమనీడా!

నాగ:—(తల వంచికొనును)

రాయ:—ప్రాడ్వివాకులారా! యువరాజహత్యా నేరమునకు ధర్మశాస్త్ర మే శిక్ష విధించునో తెల్పుడు!

ప్రాడ్వి:—ప్రభూ! కన్నులు లేక, తిండి నీరములకు దూరమై చెఱసాలలో మరణింపగల శిక్షకు నేరస్థు డర్హుడు. ప్రభువుల చిత్తము.

రాయ:—(మోము నెత్తకయే) నేరస్థుడా! నీ నేరము క్షమింపరానిది. నీకు, కన్నులు పీకి, తిండి నీ రీయక, చెర సాలలో మరణింపజేయుశిక్ష విధించినాము!!

(నిష్క్రమించును) (తెర)

---

ద్వితీయరంగము

---

[చెరసాలలో నంధుడగు తిమ్మరుసు. సమయము : నిశీథము. దృశ్యము : భీమఘనధ్వనులతో తుపాను]

తిమ్మ:—రోదసీకుహరమంతయు ప్రతిధ్వనించు నీ యశనిపాత ధ్వనిలో మ న్మనోజనితంబగు ప్రణవనాదము లీనమై పోవుచున్నది. ఓః! జగద్రక్షకుని విలాసలీలల కాలవాల మగు ప్రకృతిసౌందర్యాతిశయములను నా కందకుండ జేయు నీ ప్రతిబంధక మేమి? (అని కన్నులు తడవుకొని తత్స్పర్శచే గలిగిన బాధచే గట్టిగ) ఆః! తిమ్మరుసు చక్షువిహీనుడైనాడు. తెల్గురాజు కన్నులు కల్గియు అంధు డైనాడు. ఛీ! మరణావస్థయందుకూడ హేయమగు నీ పరనింద యేల! ఇందు రాయలతప్పేమున్నది? అప్పాజీ! నాడు నీవే కన్నులు కల్గియు అంధుడవైతివి! నీ రాజు నేల దూషింతువు. అబ్బ! అంతరంగ మెంత నిశ్చలముగ నున్నను కాయమెల్ల దావానల జ్వాలలందు మ్రగ్గుచున్న ట్లీ బాధ యేమి? సర్వేశ్వరా!

ఉ॥ సైపఁగరాని తప్పిదము
సల్పిన, ప్రాణము లొక్కసారిగా
బాయక, దేహమెల్ల శత
భాను గభస్తిచయప్రముక్తదు
స్తాపమహాగ్నికీలలను
తాపుచునుంటివి గోపబాల! ఈ
పాపపుజీవి నేడు పడు
బాధల గాంచగ ముచ్చటాయెనా॥

నా రాజు నెంతో ఘనుని చేసితినని పొంగితినిగాని "అయ్యవారిని చేయబోయి కోతిని" చేసితిని! ఇనుమంతయు కష్టములేని యొక సామాన్య హత్యా నేరమున న్యాయాన్యాయనిరూపణ చేయలేని యొకమట్టిబొమ్మను జేసితిని. మహామేధావియని కీర్తినందిన తిమ్మరు సొనర్చిన మహత్తరకార్య మేమి? మతిలేని యొకమట్టిబొమ్మ! ప్రభూ! కృష్ణరాయా! నన్ను శిక్షించినందుల కిట్లు కుందుచుంటి ననుకొంటివా! కాదు.

ఉ॥ పిన్నతనంబునుండి నిను
పెంచిన ప్రేమను వీటబుచ్చి, నా
కన్నులు పీకినందులకు
గాదు; "సుధీయుతుడంచు మున్ను తా

మన్ననలందు మంత్రియన
మానమహత్త్వఫల" మ్మటంచుని
న్నన్నదు రెల్ల రన్న తల
పేచుటచేసుమి సారెసారెకున్॥

నాయనా! నా జీవితమంతయు ధారవోసియు నిన్ను పూర్తిగా రాజునుజేయనైతిని! ఆ కొరత నీవే తీర్చుకొంటివి!

ఉ॥ పాలనమందు రామనర
పాలుని, శిల్ప కవిత్వసత్కళా
పాలనమందు భోజమహి
పాలుని, శత్రువిదారణోల్లస
త్ఖేలనమందు దగ్రలయ
కేళివిలాసుని పార్వతీపతిన్
బోలియు, రాజశబ్దపరి
పూరితి కొక్కకళంక మేసుమీ౹
చాలని దయ్యో! నే డదియు
సంభవమైనది, రాజు వన్నిటన్॥

ఇక నే నీ యిహలోకమున కోరదగిన దేదియును లేదు. నా కిక ముక్తి నొసంగుటకు మానవమాత్రున కసాధ్యము. సర్వేశ్వరా! నా కడసారికోర్కె నీవే తీర్పుము. నా మరణానంతరసందేశముగ ప్రజలకు నా నిర్దోషిత్వము వెల్లడింపుము,

ఉ॥ వ్రాయుటకాని వ్రాసినది
బాపుట నీకును చేతగాదు. నే
చేయని తప్పుకై జనుల
చే భువి శాపములందకుండ నా
కాయువుమూడినంత నిజ
మంతయు వారికి దెల్పుమయ్య! నీ
చేయగజాలు సాయ మిదె
జీవితమంతయు నమ్మినందుకై॥

సర్వేశ్వరా! నా జీవితనాటకమున తొలినాల్గుఅంకములకు సమేయకౌశల్యము నాపాదించి తుదియంకమున కొంతటి కళంక మాపాదించితివి! ఎవనికై నా రక్తప్రాణములు అర్పించితినో, ఎవని భుజస్కంధమునకు ఆంధ్రమహా సామ్రాజ్యభారము వహించుటకు బలము నొసంగ నా మంత్రిత్వము ధారబోసితినో అట్టి నా ప్రభువు, నా సుతుడు,... నా రాయలు... నా... రా... య... లు... (అని మరణించును).

(తెర)



## తృతీయరంగము.

---

[ప్రవేశము: నాగమనీడు]

నాగ:—ఆంధ్రమహారాజ్యరవి అస్తమించినది. అప్పాజి నేరస్థుడుకాడని తొలుతనుండియు నా మనము ఘోషించు చున్నది. మహామేధావి యగు తిమ్మరుసు నిజముగ నప రాధియైనచో యువరాజుహత్యకు లిఖితపూర్వ మగు ఆజ్ఞాపత్రము నొసంగునా! శోకాతురుడై రాజు అంధుడై నాడు. ఈ శిసుహత్యోద్యోగమున నాసక్తులు గజపతి దక్క అన్యులు కానరారు. (ఆలోచించి) ఆహా! నే నను కొన్నదే సత్యమైనచో గజపతిగదిలో తిమ్మరుసుముద్రిక లభింపవచ్చును. ఇప్పుడు గజపతి శోకాతురుడగు రాయల నూరడించుచున్నాడు. అతనిగది పరిశీలించుట కిదియే సమయము.

(నిష్క్రమించును.)

---

## చతుర్థరంగము.

---

[రాయలు, గజపతి.]

గజ:—నాయనా! విధికృతమునకు శోకించుట పురుషలక్షణము కాదు. శోకార్తయగు నీ దేవి నూరడింపదగిన నీవే యిట్లబలవలె విలపింతువా?

(ప్ర॥ నాగమనీడు.)

నాగ:—యువరాజహత్యానేరమునకై రాజుపేర నిన్ను బంధించుచున్నాను.

గజ:—(ధిక్కారముతో) రాయల సమక్షముననా గజపతి బాధింపబడుట!

రాయ:—నాగమనీడా!

నాగ:—ప్రభువులు యీ విషయమున నన్ను క్షమియింపవలెను. గజపతీ! శోకాతురుడగు రాజు రాచకార్యముల నుండి విరమించినాడు. నీ మూలమున మహామంత్రి తిమ్మరుసుప్రాణములును, రాయలబుద్ధిరమయును నశించినవి. రాజును, మంత్రియు లేనిరాజ్యమునకు సేనాధిపతియే సర్వాధికారి!

గజ:—నీ నిందారోపణకు నిదర్శనములు?

నాగ:—ఇంకను తప్పించుకొన చూచుచుంటివా? మూర్ఖా! తొలుత రాయలుపై కత్తిగట్టితివి. కాని, అప్పాజిదే పై చే యైనది. నేడు శిశువును, అప్పాజిని తుదముట్ట నెంచితివి; నెగ్గితివి. నాడు యువరాజు పట్టాభిషేకదినమున అప్పాజి కుమారుని వెన్నంటి తిరుగుట గాంచితివి. అప్పాజి ముద్రికను దొంగిలించి ఆతనిపేర నొక మిథ్యాపత్రమును సృష్టించితివి! ఈ ముద్రిక నీ కెక్కడనుండి వచ్చినది?

గజ:—(నీరవుడై) నాగమనీడా! నీవే గెల్చుకొంటివి. కాని నా ప్రయత్నములు సఫలీకృతములు. శిశువు, మంత్రి మరణించినారు. ఇక రాజును......

నాగ:—నోరుమూయుము! భటులారా! యీ ద్రోహిని బట్టి కారాగృహమున నుంపుడు.

గజ:—(విరక్తిపూర్వకమగు చిరునగవుతో) గజపతిని బంధింపజాలువా రిక పుట్టవలయును. (అని మొలనుండి బాకు పెటికి పొడుచుకొని చనిపోవును.)

రాయ:—అప్పాజి నిర్దోషి! దోషి? గజపతికాడు. రాయలు. దీనికి శిక్ష? ఆచంద్రతారార్కము తెల్గువారల యుసురు!

(తెర.)

---

## పంచమరంగము.

[ప్రవేశము:—కండ్ల గంతలు కట్టుకొని రాయలు
శయ్యాగతుడై]

రాయ:—అప్పాజీ!

ఉ॥ "ఎన్నడు తొంటిచింత నిజ
మేర్పడజూప" దటంచు నాడు నీ
వన్నది త్రోసిపుచ్చి, నిజ
మారయజూడక, పుత్రు జంపి తీ
వన్నది నిశ్చయించి, నృపు
నంచు నహమ్మున విజ్ఞప్తిగి ని
న్నన్నగరానికితి వధ
యించితి, సద్గతులెల్ల దప్పితిన్॥

అప్పాజీ! నాడు సభామంటపమున విష్ఫాష్ఠికముగ ధర్మ నిర్వాహణము వెలగ బెట్టుచుంటినని కులికితిని. నీ మానము నంగీకారముగా భావించితిని గాని, నా బుద్ధిబలపరీక్షగా నెంచక, ని న్నకారణముగ పోగొట్టుకొంటిని. నా దౌష్ట్యమున కెన్నడైన నిష్కృతిగలదా! నీవు నా కొనర్చిన మహత్తరసేవను అంధుడనై విస్మరించి శత్రునకైన ననర్హమగు చావు విధించినాను అప్పాజిలేని రాయలు బ్రతికియుండి యెవ్వరి కే యుపకార మొనర్పగలడు? తండ్రీ! వచ్చితివా? ఏమనుచుంటివి?

(వ్రి॥ తిమ్మరుసుభూతము)

భూత:—చ॥ పలుకులురాని బాల్యమున
ప్రాపుగ నిల్చి మహీశుజేసి, దో
ర్బలసితశక్తి శత్రునృప
వీరుల గెల్వగజేసి, శయ్యన
య్యాలికులవేణిచేత నను
లారక కాచు నశేషశేముషీ
కలితుని, పుత్రుజంపెనని
కండ్లను పీకెదవా కృతఘ్నుడా॥

రాయ:—ఇం దసత్య మే మున్నది! కృష్ణరాయా! అప్పాజి లేనిచో నీ వేమై యుందువో ఎన్నడైన తర్కించుకొంటివా? అంతయు నాతనిశక్తిగాక నీకురాజ్యమేమి తగులబడ్డదిరా కృతఘ్నుడా! నీప్రతిరక్తబిందువును నాడు మహామంత్రి ప్రజ్ఞావివేకమున పునీతము. నేడు త్వదీయ మదాంధతచే విషపూరితము. నీ వీ యిహలోకమున ననుభవించు ప్రతియనుభవమునకును అప్పాజికి ఋణస్థుడవు. అట్టి పితృసమాను డగు అప్పాజిని, చాణుక్య యుగంధరాదుల మరపింపజాలు తిమ్మరుసును చంపిన నీ కిక ముక్తి యున్నదా?

భూత:— ఉ॥ వంచనజేసి చంపుటకు
వచ్చు కళింగుని మాయలెల్ల ని
ర్జించుటొ? భక్తి వావిభవ
శీలగ నాంధ్రవసుంధరారమన్
పెంచుటొ? సంగరస్థలిని
మ్లేచ్ఛుల దున్ముటొ? నేడు నన్ను శి
క్షించుటదప్పు సొంతముగ
జేసినకార్యము లెంచి చెప్పుమా।

రాయ:— ఏమి యొనర్చుట కైనను యీ రాయలింకెన్నాళ్లు బ్రతుకును? ఏనాడు నీ నిర్దోషిత్వమును, నా యంధత్వమును బయల్పడెనో నాడే అన్నపానములు త్యజించితిని. కన్నులుగల్గియు చూడనోపనైతిని. నేడో రేపో నేనును నీవనె నే తనువు త్యజింతును.

భూత:— ఉ॥ ఇమ్మహదాంధ్రరాజ్యరమ
కీ పయి గల్గెడి మంగళంపు గీ
తమ్ముల నీ చరిత్రలను
దల్చి తపించెడి తెల్గువారి శా
పమ్ముల దగ్ధమై భువిని
బాసెదుగాక! అనంతకాలగ

ర్భమ్మున మారుమ్రోగి, మహీ
భాండము బ్రద్దలుజేసి నీకు నా
కమ్మనగూడ చెప్పెదను
గావుత తిమ్మరుసయ్య గోదనల్॥

(విశ్రమించును)

రాయ:—అప్పాజీ! సుతు డెంత నేరమొనర్చినను తండ్రి సహింపవలెగాని, యిట్లు నన్నేల రంపపుకోత పాలుజేసె దవు? నీవున్నప్పుడు అంధుడనై నీ శక్తి నరయజాలకుంటిని. నేడు నిజముగ నంధుడనై అరయుచుంటిని. ఈపాటికైనను నన్ను క్షమింపుము. నా యాత్మను చీల్చినావు సర్వేశా! దుస్సహ మనోజనితమహాగ్నికీలల పరితప్తమగుచున్న యీ కాయమున కీపాటికైనను మరణసౌఖ్య మొన గూర్పుము. అప్పాజీ! నా కడసారి వందనముల గొనుము. అప్పాజీ. అ...ప్పా...జీ...

(తెరవ్రాలును.)

సమాప్తి.

---

శ్రీరామముద్రాక్షరశాల, రాజమండ్రి.

ప్రతులు దొరకువారు:

గుంటూరు సత్యనారాయణ, ఎం. ఏ.

యలమంచిలి.

విశాఖపట్నంజిల్లా.